Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 44 • 26-10-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# కాంగ్రెస్ గెలిచేదిలేదని తేల్చి చెప్పిన సిఎం!

## • ఆశ్చర్యపోయిన మంత్రులు

చంద్రబాబు, షర్మిళ పాదయాత్రలు కాంగ్రెస్ వాదులను తీవ్రంగా ఆందోళన పరుస్తున్నాయి. నాలుగు నెలల క్రితం జరిగిన 18 స్థానాల ఉప ఎన్నికలతోనే కాంగ్రెస్ వాదులకు నిస్పృహ ఆవరించింది. సమీప భవిష్యత్తులో మళ్లీ అధికారంలోకి రాలేమన్న నిర్వేదం ఆవహించింది. దానికి తోడు కరెంట్ కష్టాలు, గ్యాస్ సిలిండర్ల ధరల గొడవ, డీజిల్ ధరల పెంపకం వంటివి ప్రజలలో పార్టీ పట్ల తీవ్రమైన ద్వేషభావాన్ని రగిలించాయన్న నిజం ప్రతి కాంగ్రెస్ వాదికీ అర్థమైంది. అయితే అధికారం చేజిక్కకపోయినా, ఒక పార్టీగా అస్తిత్వం నిలుపుకోవడమైనా సాధ్యం అవుతుందా లేదా అన్న సందేహాన్ని రేకెత్తిస్తున్నాయి వారిద్దరి పాదయాత్రలు.

సాధారణ కార్యకర్తలకే కాదు, దాదాపు మంత్రులందరిలో ఇదే నిరాశ నిస్పృహలు తాండవించడం గమనార్హం. ఒక్క కాంగ్రెస్ మంత్రి లేదా ఎమ్మెల్యేకి కూడా రేపటి ఎన్నికలలో గెలుస్తామన్న నమ్మకం కన్పించడం లేదు. తమ రాజకీయ జీవితానికి ఇదే ఆఖరి దశ అన్న నిర్వేదంలో ఉన్నారు అందరూ. పార్టీ ఇంత కష్టాలలో కూరుకపోయినప్పుడు దాని నేతగా ముఖ్యమంత్రికి తీవ్రస్థాయి ఆందోళన ఉండాలి. కానీ విచిత్రంగా కిరణ్‌కుమార్ రెడ్డి జరగాల్సింది జరుగుతుందే తప్ప మనం చేయగల్గింది ఏమీ ఉండదనే వేదాంత ధోరణిలో వ్యవహరిస్తున్నాడు. గత వారంలో డొక్కా మాణిక్యవర ప్రసాద్, బాలరాజు, పితాని సత్యనారాయణ వంటి మంత్రులు కొందరు ముఖ్యమంత్రి వద్దకు ఒక జట్టుగా వెళ్లి తమ భయాలను వ్యక్తం చేశారు. ప్రజలలో రోజు రోజుకీ పతనమైపోతున్న పార్టీ ప్రతిష్టను కొంతలో కొంతైనా నిలబెట్టుకోవడానికి ఏదో ఒక ప్రజాకర్షక పథకం అమలు చేద్దామని ప్రతిపాదించారు. అయితే విచిత్రంగా ముఖ్యమంత్రి వారికి వేదాంతం బోధించి పంపేశాడు. ఒకటికి రెండు సార్లు ఈ రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి జనం ఓట్లు వేశారు. సమకాలీన రాజకీయాలలో మూడవసారి అధికారంలోకి వచ్చిన దాఖలాలు ఎక్కడా లేవు. మనం ఎంత చేసినా జనం మెచ్చరు. ఒకసారి ప్రతి పక్షాలకు ఓటు వేస్తే తప్ప వారి మనసు మారదు. అందువల్ల అనవసర ఆందోళన మానుకోండి. ఏ పథకమూ మనల్ని కాపాడలేదు... అని వివరంగా చెప్పాడట ఆయన. ముఖ్యమంత్రి నోట నుంచి అటువంటి వాదన విని, మతులు పోగొట్టుకొన్నారు మంత్రులు.

అయితే చాలా మంది సీనియర్ మంత్రులకు ఈ విషయం ముఖ్యమంత్రి చెప్పకుండానే అర్థమైందన్నది నిజం. అందువల్లనే వారు ఈ ఒకటిన్నర ఏడాదిలో ఎంత వీలైతే అంత అధికారాన్ని అనుభవించడం, దోచుకొని దాచుకోవడం తక్షణ కర్తవ్యం

కొరవ 14వ పేజీలో

# జింకలా షర్మిళ - తాబేలులా బాబు పాదయాత్రలు!

షర్మిళ పాదయాత్రకు లభిస్తున్న జనాదరణ తెలుగుదేశం పార్టీని కలవర పరుస్తున్నది. కడప, అనంతపురం జిల్లాలలో చంద్రబాబుతో పోలిస్తే షర్మిళ పాదయాత్ర ఎన్నో రెట్లు అధిక జన సమర్ధంగా నడుస్తున్నది. అందుకు చాలా కారణాలున్నాయి. ఆమె వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుమార్తె. వైఎస్ పట్ల ప్రజలలో ఎంత కృతజ్ఞతా భావన ఉందో ఈ రెండేళ్లలో జరిగిన ప్రతి ఉపఎన్నిక రుజువు చేసింది. మహిళ కావడం అదనపు ఆకర్షణ. రాష్ట్ర చరిత్రలో ఒక మహిళ ఈ స్థాయిలో పాదయాత్ర చేపట్టడం కానీ, జనంలోకి రావడం కానీ ఇంతకు ముందు ఎప్పుడూ జరగలేదు. ఆమెను చూడడానికి ఎగబడుతున్నారు జనం. వీటికి అదనంగా జగన్ నిర్వహణా సామర్థ్యం జత కలుస్తున్నది. దాదాపుగా అన్ని జిల్లాలలో జగన్‌కు సమర్ధవంతమైన నాయకత్వం ఉంది. వచ్చే ఎన్నికలలో గెలుపు గ్యారంటీ అనే నమ్మకంతో ఉన్న నాయకులు కావడంతో జగన్ చిన్నపాటి పిలుపు ఇచ్చినా ఇల్లు ఒల్లు గుల్ల చేసుకొని మరీ పార్టీ కోసం పని చేస్తున్నారు వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలు. షర్మిళ పాదయాత్ర ఒక రకమైన ఎన్నికల ప్రచారం కావడంతో ఏ నియోజకవర్గానికి ఆ నియోజక వర్గంలో అభ్యర్థిత్వ ఆశలున్న వారు తమ సర్వశక్తులు ఒడ్డుతున్నారు.

కొరవ 14వ పేజీలో

# ప్రజాస్వామ్యానికి పనికి రామా?

యుగం మారినప్పుడల్లా ధర్మానికి నిర్వచనం మారిపోతూ వుంటుంది. త్రేతాయుగంలో ఏకపత్నీ వ్రతాన్ని కఠోరంగా పాటించిన శ్రీరాముడు ఆదర్శ పురుషుడైనాడు. అదే ద్వాపర యుగానికి వచ్చేసరికి అష్ట భార్యలున్న శ్రీకృష్ణుడు యుగపురుడిగా కీర్తి పొందాడు. ఒక కాలంలో తప్పు అయ్యింది, మరొక కాలంలో ఒప్పుగా మారిపోతూ వుంటుంది. ఇది కలికాలం. ఇక్కడ నీతికి, అవినీతికి నిర్వచనాలు మార్చుకోవాలే తప్ప రాజకీయవాదులందరూ నీతి తప్పుతున్నారని బాధపడడం అవివేకం.

నిన్నటి వరకు అధికారంలో వున్న కాంగ్రెస్‌వాదులు, దాని మిత్రపక్ష నేతలు ప్రజాధనాన్ని దోచుకోవడంలో ఘన కీర్తి పొందారు. ఇప్పుడు తాజాగా బిజెపి జాతీయ అధ్యక్షుడు నితిన్ గడ్కరీ రాజకీయ అవినీతిలో కాంగ్రెస్‌కు తామేమీ తీసిపోమని రుజువు చేస్తున్నాడు. అన్నాహజారే బృంద సభ్యుడు కేజ్రీవాల్ మొదటగా నితిన్ గడ్కరీ మీద నీతి తప్పాడన్న మసి పూశాడు. టీవీ ఛానళ్ల విలేకరులు ఆ తీగ లాగడం మొదలు పెట్టేసరికి పెద్ద డొంక కదిలి వస్తున్నది. ఆంధ్రలో వైఎస్.జగన్ తరహాలోనే మహారాష్ట్రలో ఆ పెద్ద మనిషి అక్రమార్జన కూడబెట్టడంలో వినూత్న పద్ధతులు అవలంభించాడట. ఆయనకు సంబంధించిన ఒక ప్రధాన కంపెనీలో ఆయన డ్రైవరు, అకౌంటెంట్, అటెండరు, చివరకు ఆయన స్వంత జోతిష్యుడు కూడా డైరక్టర్లుగా వున్నారట. పైపెచ్చు పూటకు ఠికానా లేని ఆ సగటు జీవులందరూ ఆ కంపెనీలో కోట్లాది రూపాయలు పెట్టుబడిగా పెట్టినట్లు తేలిందట. మరొకప్రక్క అచ్చు జగన్ వలెనే కలకత్తా చిరునామాతో చిరునామాయే లేని సూట్‌కేస్ కంపెనీల పేరుతో కూడా గడ్కరీ కోట్లాది రూపాయల పెట్టుబడి సేకరించాడట. ఇవన్నీ నల్లధనాన్ని తెల్ల ధనంగా మార్చుకొనే ప్రయత్నంలో భాగమని చెప్పకనే అర్థమైపోతున్నది. నల్లధనం ఎక్కడ నుంచి వస్తుందో చెప్పనవసరం లేదు. రాజకీయవాదులు, కాంట్రాక్టర్లు, క్రిమినల్స్, అధికారులతో ఏర్పడే చతుష్టు కూటమి ఎటువంటి పనులు చేస్తుందో, ఏ ఏ రీతులలో అక్రమార్జన జరుపుతుందో జగమెరిగిన సత్యం.

జమీన్‌రైతు

బహుశా అందువల్లనే కాబోలు అగ్రనేత ఎల్‌కె.అద్వానీతో సహ బిజెపి పెద్ద తలలన్నీ పోటీలుపడి మరీ నితిన్ గడ్కరీ మంచి బాలుడనే ప్రకటనలు గుప్పిస్తున్నాయి. సుష్మా స్వరాజ్, రాజ్‌నాథ్‌సింగ్, వెంకయ్య నాయుడు వంటి వారంతా గడ్కరీకి అండగా నిలబడుతున్నారు. తనపై వచ్చిన ఆరోపణలపై ఎటువంటి దర్యాప్తుకైనా సిద్ధమని గడ్కరీ ప్రకటిస్తున్నాడు కాబట్టి, తప్పు చేసినవాడు విచారణ కోరుకోడు కాబట్టి, గడ్కరీ తప్పు చేయలేదనే తీర్మానానికి వచ్చేస్తున్నారు. వీరందరికీ గడ్కరీ మీద ప్రేమ కాదు. నరేంద్ర మోడి అంటే భయం. రేపు డిసెంబర్‌లో జరగనున్న గుజరాత్ ఎన్నికలలో మరొకసారి మోడి గెలిస్తే, నేరుగా ఢిల్లీకి వచ్చేస్తాడని, ప్రధాని పదవికి ప్రధాన అభ్యర్థిగా ఎదిగిపోతాడని భయం. మోడిని గుజరాత్‌లోనే నిలవరించడానికి వీరందరూ గడ్కరీని అడ్డం పెట్టుకొంటున్నారు. అయితే ఆర్ఎస్ఎస్‌లో వున్న దంతా పాత చింతకాయ పచ్చడి వంటి చాందసులు. దానితో వారు మాత్రం బిజెపి అధ్యక్షుడి స్థానంలో వున్న వ్యక్తి ఇటువంటి గలీజు వ్యవహారాలతో గబ్బు పట్టడం సహించలేమని హూంకరిస్తున్నారు.

ఏది ఏమైనా అవినీతి విషయంలో, నీతి తప్పడంలో కాంగ్రెస్‌కు తామెంత మాత్రం తీసిపోమని రుజువు చేస్తున్నది బిజెపి. జాతీయస్థాయిలో రాజకీయంగా సమస్థాయిలో వున్న పార్టీ, రాజకీయ సులక్షణాలతో పాటు దుర్లక్షణాలలో కూడా పోటీకి నిలవాలి కదా మరి? కానీ అసలే రోతపట్టిపోయిన రాజకీయ వ్యవస్థ గడ్కరీ పుణ్యమా అని మరింత భ్రష్టుపట్టి పోయింది. రాజకీయవాదులంటే చీడ పురుగులనే సాధారణ ప్రజాభిప్రాయాన్ని ధృవపరుస్తున్నది. స్వాతంత్ర్యానికి ముందు దేశం కోసం తమ ఆస్తులన్నీ త్యాగం చేసేవారే రాజకీయ నేతలుగా వెలుగులో వుండేవారు. ఇప్పుడు యుగం మారింది. దేశాన్ని పట్టపగలు నిట్టనిలువుగా దోచుకొని, దాచుకొనే ప్రబుద్ధులే నిజమైన రాజకీయ నేతలుగా చలామణి అవుతున్నారు. యుగం మారినప్పుడల్లా ధర్మం మారడం అంటే ఇదే మరి. అప్పటి రాజకీయ ధర్మం – త్యాగం. ఇప్పటి రాజకీయ మర్మం – స్వార్థం. ఆ తేడాను అర్థం చేసుకొంటే రాజకీయం దిగజారిపోయిందనే ఆవేదనతో మనసు కలత పెట్టుకోవాల్సిన అవసరం ఏర్పడదు.

## జనవాణి

### సుభాషణ్‌రెడ్డి ఎంపిక సముచితం!

ఆంధ్రప్రదేశ్ లోకాయుక్తగా జస్టిస్ బి.సుభాషణ్‌రెడ్డి ఎంపిక సముచిత నిర్ణయం. జస్టిస్ సుభాషణ్‌రెడ్డి పేద ప్రజల పక్షపాతి. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగా, తమిళనాడు, కేరళ హైకోర్టుల ప్రధాన న్యాయమూర్తిగా, రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ ఛైర్మన్‌గా వివిధ హోదాలలో పనిచేసిన సుభాషణ్‌రెడ్డి తన పదవీకాలంలో పేదవారి కోసం పోరాడారు. మానవ హక్కుల కమిషన్ ఛైర్మన్‌గా ఉన్న కాలంలో పలు ప్రజా సమస్యలను సుమోటో కేసులుగా తీసుకొని ప్రజలకు అండగా నిలిచారు. లోకాయుక్తగా నియమితులైన సుభాషణ్ రెడ్డికి అభినందనలు.

ఎస్.బాబూరావు — కావలి

### ప్రాణాలు నిలిపి డబ్బుతింటే నేరమా?

ఈ మధ్య పత్రికల్లో నెల్లూరు పెద్దాసుపత్రి బ్లడ్ బ్యాంకులో రక్తదానం చేస్తే ఆ రక్తాన్ని అక్కడి డాక్టరు, సిబ్బంది అమ్ముకొన్నారని వార్తలు వెలువడ్డాయి. బ్లడ్ బ్యాంకులో నిల్వస్థాయికి మించిన రక్తమొస్తే దాన్ని ఇంకొక చోటికి తరలించి వేరొకరి ప్రాణాలు నిలపడం నేరమా? ఒక రక్తం ప్యాకెట్ మహా అమ్మితే మూడు, నాలుగు వేలకు అమ్మి ఉంటారు. ఈ మొత్తంకన్నా ఒక మనిషి ప్రాణం ఎంతో విలువైనది. బ్లడ్ బ్యాంకుపై విమర్శలు చేసే నాయకులు, మీడియా అక్కడ పెద్ద మొత్తంలో రక్తం నిల్వచేసే వసతుల కల్పనకు తమవంతు ప్రయత్నం చేస్తే బాగుంటుంది.

తూపిలి వనమాలి — నెల్లూరు

### నాగార్జున ముఖంలో దైవత్వం లేదు!

'జమీన్‌రైతు' పత్రికలో శిరిడిసాయి సినిమాను సమీక్షచేస్తూ ఈ సినిమాను చూడొచ్చు అని వ్రాశారు. కానీ నిజంగా ఈ సినిమాను చూడలేం. చాలా రోజుల క్రితం మహానటుడు అక్కినేని నాగేశ్వరరావు ఒక మాటన్నారు. ఒక నటుడు నటించిన పాత్రను మళ్లీ ఇంకో నటుడు పోషిస్తే బాగుండదన్నారు. దీనికి బీదలపాట్లు, దేవదాసు, పోతన, లవకుశ చిత్రాలు ఒక ఉదాహరణ. ఏసుప్రభు, షిర్డి సాయిబాబా పాత్రల్లో విజయచందర్ జీవించారనాలి. శిరిడిసాయి చిత్రంలో అక్కినేని నాగార్జున నటన తాగుబోతులా ఉంది. ఆయన ముఖంలో దైవత్వం ఏమాత్రం కానరాలేదు.

పి.ఆదిలక్ష్మి — నెల్లూరు

### మగవాళ్ల సంక్షేమ శాఖ!

మహిళా సంక్షేమ శాఖ కార్యాలయం గృహహింస, ఇతర ఇబ్బందులు పడే ఆడవాళ్లకు అండగా నిలవాలి. కానీ నెల్లూరులోని మహిళా సంక్షేమ శాఖ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

4-11-1942
పేజీలు : 8 వెల: అణా

(జమీన్‌రైతు అక్టోబర్ 31వ తేది సాయంత్రం నూతన గృహప్రవేశం జరుపుకోనున్నది; ఈ సందర్భంగా 1947 మే 16 తేది నాటి సంచికలోని, జమీన్‌రైతుకు 45 ఏళ్లపాటు నీడనిచ్చిన తిప్పరాజువారి వీధి భవనం ప్రవేశోత్సవ వార్తను పునః ప్రచురిస్తున్నాము)

### జమీన్‌రైతు నూతన గృహ ప్రవేశోత్సవం

2వ తేది రాత్రి ఆర్యధర్మ సూత్రాల ప్రకారం గృహ ప్రవేశం జరిగింది. 12 సాయంకాలం అధునాతన వేదబుక్కుల ననుసరించి టీ పార్టీ అనెడి ఉపాహార సహిత కాఫీ పార్టీ జరిగింది. ప్రముఖులంతా విచ్చేసి పాల్గొన్నారు. విజయాక్షతలు చల్లారు. రాజాలనే పెద్ద ఆశీస్సులు, సందేశాలు, కట్నాలు ఇవి;

జమీన్‌రైతు సంపాదకులు,
శ్రీ.నె.వేం.రామానాయుడు గారికి

మిత్రమా!

ఇంతకాలమునకైనను 'జమీన్‌రైతు'కు ఒక స్వంత భవనము ఏర్పడనుండెనని తెలిసికొని చాలా సంతోషించితిని. మన దేశమునకు ఇప్పుడిప్పుడే దేశభాషా పత్రికలు తలయెత్త గల్గుచున్నవి. స్వంత భవనము గల దేశభాషా పత్రికల సంఖ్య బొంబాయి నగరముననే రెండు. వానిలో ఒక పత్రిక ఆంగ్ల పత్రికతో కలసియున్నది. ఇట్లుండ ఎన్నో కష్టములకు, బెదరింపులకు ఓర్చి మీ యాజమాన్యమున నడపబడుచుండెడి పత్రికకు స్వంత భవనమేర్పడెనని విని దూర రాష్ట్రమున నుండెడి నేను ఎంతో ఆనందమును చెందితిని.

బి.హనుమంతరావు, అసిస్టెంట్ ఎడిటర్
ది నేషనల్ స్టాండర్డ్, కొలాబా – బాంబే.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

26-10-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు
### దేశభక్తి

చైనా భారత యుద్ధంలో – సేవాత్యాగాలతో ముందుకు వస్తున్న ఇతర ప్రాంతీయుల దేశభక్తితో నెల్లూరీయులు ఏమాత్రం తీసిపోవడం లేదు.

వృద్ధ(వయసులో మాత్రం) కాంగ్రెస్‌వాది వెన్నెలకంటి రాఘవయ్య కాంగ్రెస్ అధ్యక్షునికి ఒక లేఖ వ్రాస్తూ 66 సంవత్సరాల వయస్సులో ఉన్న తాను యుద్ధంలో సేవజేయదలచానని వెలిబుస్తూ తన సేవను యుద్ధరంగంలోగాక, ప్రచార ప్రబోధ తదితర విషయాలలో ఉపయోగించుకోవలసిందిగా కోరారు. స్వల్పమైన తన ఆదాయంలో ఎనిమిదవ వంతు(సంవత్సరానికి 420 రూపాయలు)ను యుద్ధం జరిగినన్ని రోజులూ దానికి విరాళంగా స్వీకరించవలసిందిగా గుడా రాఘవయ్య గారు కాంగ్రెస్ అధ్యక్షుని కోరారు.

బుచ్చి సమితి అధ్యక్షుడు దొడ్ల లక్ష్మీనరసారెడ్డి గారు గూడా యుద్ధానికి సహాయంగా 1116 రూపాయల విరాళాన్ని ప్రధానికి పంపారట.

యువకులకు ఆదర్శప్రాయమైన రాఘవయ్య గారి దేశభక్తిని, లక్ష్మీనరసారెడ్డి గారి త్యాగాన్ని కొనయాడుతున్నాము.

### కుళాయిలలో బురద

20వ తేది నెల్లూరు కొళాయిలలో బురద, కశ్మలంతో గూడిన నీరు సరఫరా అయ్యింది. లక్షలాది ఖర్చుతో నీటిసరఫరాలో మునిసిపాలిటీ సాధించిన అభివృద్ధి యిదేనా?

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరుకు శృంగేరీ శారదా పీఠాధిపతి!

శృంగేరీ శారదా పీఠాధిపతి శ్రీ భారతీ తీర్థమహాస్వామి నవంబరు నెల మొదటి వారంలో నెల్లూరు వస్తున్నారు. 6, 7, 8 తేదీల్లో నగరంలోనే ఉండే స్వామి సిపిఆర్ కళ్యాణ మండపంలో లోక కళ్యాణార్థం శ్రీ శారదా చంద్రమౌళీశ్వర పూజ నిర్వహిస్తారు. సింహపురి ఆస్తిక ప్రజానీకాన్ని ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నాడు నిర్వాహకుడు పెళ్లూరు సుధాకర్‌రెడ్డి.

## చిత్త కార్తె చినుకులు

చిత్త కార్తె, ఈశాన్య రుతుపవనా మధ్య కెమిస్ట్రీతో 19, 20, 21 తేదీల్లో జిల్లా అంతటా ఓ మోస్తరు వర్షం పడింది. దీని మూలంగా వ్యవసాయ పనులు జోరందుకొన్నాయి. స్వాతి, విశాఖ కార్తెలలోనైనా కాస్త వర్షం దంచి కొడితే తప్ప ఈ యేడాది చెరువులు నిండవు. సోమశిల, కండలేరు ప్రాజెక్టులలో నీటి నిల్వలు చేరవు.

## ఎస్పీ పలుకు బంగారం!

పోలీసు అధికారుల్లో ఏ స్థాయి వారైనా క్రిందిస్థాయి వారిని ఏక వచనంతో సంభోదించడం సహజంగా ఉంటుంది. కానీ మన ఎస్పీ బి.వి.రమణ కుమార్ కానిస్టేబుల్, ఎస్ఐ మొదలు కొని ఏ స్థాయివారినైనా వ్యక్తిగతంగా కలసినప్పుడు వివిధ అంశాలపై ఫోన్లలో మాట్లాడినపుడు 'అండీ' అని సంభోదించడం విశేషంగా చెప్పుకోవచ్చు. గౌరవ మనేది ఇచ్చిపుచ్చుకోవడంతోనే వస్తుందని పెద్దలు ఊరికే చెప్పారా? అందుకే ఎస్పీగారిని పోలీసు శాఖలో ఏ స్థాయి అధికారి కూడా పొరపాటున ఒక మాట అనరు.

## స్వంత నిర్ణయాల కలెక్టర్!

కలెక్టర్లు ఎప్పుడూ ఏ విషయంపైనైనా స్వంత నిర్ణయాలు తీసుకోవాలి. ఈ మధ్య వస్తున్న కలెక్టర్లు అధికార పక్ష నేతల మాటలను బాగా వినడం నేర్చుకున్నారు. సహజంగానే వివాదాస్పద నిర్ణయాలకు దూరంగా ఉండే కలెక్టర్ శ్రీధర్ రెడ్డి ఈ మధ్య రూల్ ప్రకారం నడుస్తుండడంతో అధికార పార్టీ నేతలు తట్టుకోలేక పోతున్నారు. కలెక్టర్‌ను డైరెక్ట్‌గా ఏమీ అనలేక ఇన్‌ఛార్జ్ జెసిగా ఉన్న లక్ష్మీకాంతంపై ఆర్థిక మంత్రి గయ్యిమంటూ పడదం కలెక్టర్ రూల్ ప్రకారం నడవడమేనని రెవిన్యూ వర్గాలలో చర్చ జరుగుతుంది.

## హిజ్రాల వీడియోగ్రఫీ!

నెల్లూరు నగరంలో వందల సంఖ్యలో హిజ్రా(కొజ్జా)లున్నారు. వీరి జీవన శైలి విభిన్నంగా ఉంటుంది. ఆడవాళ్లలా భ్రమ కలిగించేలా ఉన్న కొందరు హిజ్రాలు సంఘ విద్రోహ కార్యక్రమాల్లో పాల్గొంటున్నారన్న అనుమానంతో ముందు జాగ్రత్తగా స్పెషల్ బ్రాంచ్ పోలీసులు ఎస్పీ బంగళాకు ఇటీవల పిలిపించి పోలీసుల వీడియో గ్రాఫర్‌తో ప్రత్యేకంగా వీరందరినీ 'షూట్' చేయించడం చర్చనీయాంశమయ్యింది.

## ఎస్పీ బంగళాలో సిసి కెమెరాలు!

నెల్లూరు పొదలకూరురోడ్డులోని ఎస్పీ బంగళాలో గతంలో ఎన్నడూలేనట్లుగా అన్ని పాయింట్లలో సిసి కెమెరాలు ఏర్పాటుచేసి ఉన్నారు. బంగళా ముందు రోడ్డులో వెళ్లే వాహనాలు మొదలు, లోపలకు అడుగుపెట్టి ఎస్పీ గారిని కలిసే వరకు వెళ్లినవారి ప్రతి కదలికను ఆయనే స్వయంగా చూసే ఏర్పాటుంది. పగలు రాత్రి తేడా లేకుండా ఈ వ్యవస్థ పనిచేయడం విశేషం.

## విద్యుత్ కోత లేదు!

ట్రాన్స్‌కో అధికారులకు ఏమయ్యిందో ఏమో 20 నుండి 25తేదీ వరకు నగరంలో విద్యుత్ కోత విధించలేదు. లేకుంటే అధికార కోత ఆరు గంటలకు తోడు అనధికారికంగా ఇంకో గంట అదనంగా విధిస్తూ ప్రజల చేత బాగా తిట్లు తినేవారు. బహుశా వర్షం మూలంగా వినియోగం తగ్గడమో లేక పండుగ ప్రభావమో కోతను విధించినట్లులేదు.

## చేపలు కిలో @100!

ఎప్పుడు ఏ వస్తువు ధర ఎందుకు పెరుగుతుందో జనానికి తెలియని కాలమిది. మాంసాహారులు కొని తినే స్థితిలో లేవు మటన్, చికెన్లు. మటన్ రాష్ట్రంలో ఎక్కడాలేనట్లు 420 రూపాయలు, స్కిన్ లెస్ చికెన్ 150 రూపాయలుగా అమ్ముతున్నా నెల్లూరు మార్కెట్‌లో కిలో 70 – 80 రూపాయల మధ్య గండి, బొచ్చె రకం చేపలు దొరికేవి. విజయదశమి పండుగను పురస్కరించుకొని రేటు తగ్గాల్సింది పోయి ఇవి వంద రూపాయలయ్యాయి. కోడిగుడ్డు రోజురోజుకు పెరగడం తప్ప తగ్గకపోవడంతో మాంసాహారులు వీటిని తినడం మర్చిపోవాల్సి వస్తుంది.

## స్టేట్‌బ్యాంక్‌లో ఏం జరిగింది?

నెల్లూరు నిప్పో సెంటర్‌లోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖలో ఆదివారం తెల్లవారుజామున అగ్నిప్రమాదం జరిగి ఫర్నీచర్, స్టేషనరీ మొత్తం కాలిపోయింది. నగదు, బంగారం, లాకర్స్‌లో విలువైన సామాగ్రి మాత్రం సేఫ్ అంటున్నారు బ్యాంకు అధికారులు. ముందు ఈ అగ్ని ప్రమాదానికి ఎలక్ట్రిక్ షార్ట్ సర్క్యూట్ కారణమని చెప్పినా ఆ తర్వాత బ్యాంక్‌ను దోచుకోను వచ్చిన దొంగల పనిగా అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. పోలీసులు ఈ విషయమై లోతు దర్యాప్తు చేస్తున్నారు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## తగ్గిన హాళ్లు – పెరిగిన ప్రేక్షకులు!

నెల్లూరులో గతంలో 18 సినిమా హాళ్లు ఉండేవి. ప్రస్తుతం వీటి సంఖ్య 13కు చేరుకుంది. ప్రేక్షకులు వసతులు బాగున్న ఏడు హాళ్లకు మాత్రమే వెళ్తున్నారు తప్ప మిగతా హాళ్లకు పోవడానికి ఆసక్తి చూపడం లేదు. దీనివల్ల మొదటి వారంలో సినిమా బాగుందని టాక్‌వస్తే బాగున్న హాళ్లలో టిక్కెట్లు దొరకడం లేదు. ఈ వారంలో విడుదలైన కెమెరామెన్ గంగతో రాంబాబు సినిమాకు ఎస్–2 థియేటర్లలో దసరా అయ్యే వరకు టిక్కెట్లు లేవు. కానీ ఈ సినిమా ప్రదర్శిస్తున్న మిగతా థియేటర్లలో ఈజీగానే టిక్కెట్లు దొరకడం ప్రత్యేకంగా చెప్పుకోక తప్పడం లేదు.

## మర్రిపాడు తహశీల్దార్ సస్పెన్షన్!

ఆరవ విడత భూ పంపిణీ నివేదిక తయారీ, అర్హులైన లబ్దిదారుల జాబితాను రూపొందించడంలో తీవ్ర అలసత్వం చూపినందుకు మర్రిపాడు తహశీల్దార్ రవీంద్రనాథ్‌పై కలెక్టర్ సస్పెన్షన్ వేటు వేశారు. జిల్లా పరిషత్ మీటింగ్ హాల్‌లో జరిగిన తహశీల్దార్ల సమీక్షా సమావేశంలో అక్కడికక్కడే కలెక్టర్ తీసుకున్న ఈ నిర్ణయం రెవిన్యూ వర్గాలలో చర్చనీయాంశమయ్యింది.

## ఓటర్ల జాబితా సవరణకు గడువు 30వ తేది!

జిల్లాలో ఓటర్ల జాబితా సవరణకు 30వ తేది తుది గడువుగా నిర్ణయించారు. 18ఏళ్లు నిండిన వారికి సైతం ఓటు హక్కు కల్పించమని 21వ తేది కలక్టరేట్‌లో ఎన్నికల సంఘం పరిశీలకుడు మధుసూదన్ రావు నిర్వహించిన సమీక్షా సమావేశంలో సలహా ఇచ్చారు. గ్రామాల్లో ఓటర్ల జాబితాలో మార్పు చేర్పులు బాగానే జరుగుతున్నా నెల్లూరు నగరంలో జరగకపోవడానికి కారణాలను ఆయన అడిగి తెలుసుకున్నారు. పోలింగ్ కేంద్రం అధికారిగా నియమించిన వారికి గత ఏడాదిగా గౌరవ వేతనం అందకపోవడంతో ఈ అధికారులు ఈ బాధ్యతల పట్ల పెద్దగా స్పందించడం లేదు. అందుకే జాబితాల్లో లెక్కలేనని తప్పులు. సవరణలు లేకుండాపోయాయి.

## బ్రాహ్మణిజంపై నిరసన!

తమ పనేదో తాము చేసుకొనే బ్రాహ్మణ సోదరులు వీధుల్లో పడి ధర్నాలు చేశారు. దిష్టిబొమ్మలు తగుల బెట్టారు. దీనికి కారణం 'ఏ ఉమెన్ ఇన్ బ్రాహ్మణిజం' సినిమాలో బ్రాహ్మణ మహిళలను నీచంగా చూపించడం. ఇంకా విడుదలకాని ఈ చిత్రం యూట్యూబ్‌లో హల్‌చల్ చేస్తుంది. మూడో తరగతి మళయాళ సినిమాను పోలిన ఈ చిత్రం అమ్ముకోవడానికి నిర్మాత, దర్శకుడు వేసిన పబ్లిసిటీ ఎత్తుగడ బాగానే వర్కవుట్ అయ్యింది. నిరసనలు వెల్లువెత్తాయి. నెల్లూరు మద్రాస్ బస్టాండ్ వద్ద గల ప్రకాశం పంతులు విగ్రహం వద్ద జరిగిన ఈ నిరసనలో బ్రాహ్మణ పెద్దలు రాళ్లపల్లి రామసుబ్బారావు, డాక్టర్ అజయ్‌కుమార్, స్వయంపాకుల శ్రీనివాసులు, ఆలూరి శిరోమణిశర్మ తదితరులు పాల్గొన్నారు.

## ముత్యాలమ్మకు బంగారు వడ్డాణం!

తూర్పు కనుపూరులో వెలసిన ముత్యాలమ్మకు దొరువుకట్టవాసి చిల్లకూరు దశరథరామిరెడ్డి, వెంకటేశ్వరి దంపతులు నాలుగు లక్షల రూపాయల విలువైన వడ్డాణాన్ని 21వ తేది బహూకరించారు. 122గ్రాముల బరువున్న ఈ ఆభరణాన్ని ఆలయ ధర్మకర్తల మండలి మాజీ ఛైర్మన్ వేమారెడ్డి మురళీమోహన్‌రెడ్డి, కార్యనిర్వహణాధికారి ఆవుల వెంకటేశ్వర్లుకు దశరథరామిరెడ్డి దంపతులు అమ్మవారికి అలంకరించమని అందించారు.

## దసరా దండకాలు

దసరా వచ్చిందంటే మామూళ్ల పండుగే. పగటి వేషగాళ్లు ఇల్లిల్లు తిరిగి పదోపరకో పుచ్చుకొనే వాళ్లు. కానీ ఇప్పుడు దసరా వచ్చిందంటే పోలీసులకు, ఎక్సైజ్‌శాఖకు చేతినిండా డబ్బులే. మద్యం వ్యాపారుల వద్ద తమకు రావాల్సిన మామూళ్లకు ముక్కుపిండి వసూలు చేయడంతో ఈ రెండు శాఖలు పోటీలు పడుతున్నాయి. ఇక టెలికాం, విద్యుత్ సిబ్బంది అందినకాడికి వినియోగదారుల నుంచి వసూళ్లు చేస్తున్నారు. ఆయా శాఖల ఉన్నతాధికారులు దసరా మామూళ్ల వసూలు చేసినట్లు తెలిస్తే కఠిన చర్యలు తీసుకొంటామని హెచ్చరిస్తున్నా మామూళ్ల వసూలు జరిగిపోయింది.

## చేజర్ల హైస్కూల్ స్వర్ణోత్సవాలు!

చేజర్ల హైస్కూల్ ఏర్పాటుచేసి 50 ఏళ్లయ్యింది. 1962లో ఈ పాఠశాలను ఏర్పాటు చేశారు. ఆనాటి నుంచి ఎంతో మంది విద్యార్థులు ఈ పాఠశాలలో చదువుకొని వివిధ రంగాలలో రాణిస్తున్నారు. పాఠశాల ఏర్పడి యాభై ఏళ్లు

కొరవ 14వ పేజీలో



రవిచంద్రను సన్మానిస్తున్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.

# సోమిరెడ్డి బాటలో సాగుతా!

## టిడిపి కొత్త అధ్యక్షుడు రవి ప్రకటన

సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి నేతృత్వంలోనే తాను పదవీ బాధ్యతలు నిర్వహిస్తానని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడిగా ఎన్నికైన బీద రవిచంద్ర చెప్పారు. తన ఎన్నిక అనంతరం నెల్లూరు మినీ బైపాసు రోడ్డులోని తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో క్రిక్కిరిసిన కార్యకర్తల మధ్య ఆయన ఉద్వేగంగా మాట్లాడారు. జిల్లా పార్టీ పెద్దగా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మార్గదర్శకత్వంలోనే నేను నడుస్తాను. గతంలో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి జిల్లా అధ్యక్షుడిగా, తాను జిల్లా కార్యదర్శిగా జిల్లా కమిటీలో ఎంతో కీలకంగా వ్యవహరించామన్నారు. ఇప్పుడు ఆయన సూచనలు, సలహాలు గౌరవిస్తూ పార్టీని ముందుకు తీసుక వెళ్లడంలో అవిరళ కృషి చేస్తానన్నారు. తనపై ఉంచిన నమ్మకాన్ని ఒమ్ము చేయకుండా పార్టీ అభ్యున్నతికై పాటు పడతానన్నారు. 1992లో అల్లూరు మండల తెలుగుదేశం పార్టీ యువత అధ్యక్షునిగా తొలి పదవిని చేపట్టిన తనకు తెలుగుదేశం పార్టీ ఎన్నో పదవులు కట్టబెట్టిన విషయాన్ని రవిచంద్ర గుర్తుకు తెచ్చుకున్నారు. ఎలాంటి మన స్ఫర్థలకు తావివ్వకుండా కలసికట్టుగా పార్టీ అభ్యున్నతికి పాటుపడతామని సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఈ సందర్భంగా ప్రకటించారు. నారా చంద్రబాబు నాయుడు నిర్వహిస్తున్న వస్తున్నా... మీ కోసంకు అనుబంధంగా నిర్వహించ తలపెట్టిన పాదయాత్రను డిసెంబర్ నెలకు వాయిదా వేస్తున్నామన్నారు. ఈ సందర్భంగా పెద్ద ఎత్తున తెలుగుదేశం పార్టీ అభిమానులు బీద రవిచంద్రను పూలమాలలతో ముంచెత్తారు.

# తెలుగు నాయకులు వీరే!

## తెలుగుదేశం పార్టీ జంబో కార్యవర్గం

తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యవర్గాన్ని పార్టీ పరిశీలకుడు మాజీ మంత్రి బొజ్జల గోపాలకృష్ణారెడ్డి ప్రకటించారు. పార్టీ జిల్లా అధ్యక్షునిగా బీద రవిచంద్ర, ప్రధాన కార్యదర్శిగా ఎర్రంరెడ్డి గోవర్ధన్‌రెడ్డి, కోశాధికారిగా సోమిరెడ్డి శ్రీనివాసులురెడ్డి, ఉపాధ్యక్షులుగా ఉక్కాల రాజేశ్వరమ్మ, జొన్నలగడ్డ రామానాయుడు, చేవూరు విజయమోహన్‌రెడ్డి, మాలేపాటి రవీంద్రనాయుడు, గూడూరు రఘునాథరెడ్డి, చెలికం శంకరరెడ్డి, మునుకూరు రవికుమార్‌రెడ్డి, గాలిబోయిన లక్ష్మీనరసయ్య, వేమిరెడ్డి ఆనందరెడ్డి, జివిఎస్ శేఖర్‌రెడ్డి, షేక్ ఖాజావలి, ధర్మవరపు సుబ్బారావులను నియమించారు. జిల్లా పార్టీ అధికార ప్రతినిధులుగా చిన్నపిల్లల వైద్యుడు డాక్టర్ జడ్.శివప్రసాద్, దంతులూరు వెంకటేశ్వరరావు, శీలం కిరణ్‌కుమార్, ప్రచార కార్యదర్శిగా ఒట్టూరు సంపత్‌రాజు, కార్యదర్శులుగా 30 మంది, సహాయ కార్యదర్శులుగా 15 మంది, కార్యవర్గ సభ్యులుగా 24 మంది, ప్రత్యేక ఆహ్వానితులుగా 20 మందిని ఎంపిక చేశారు.

### తెలుగు మహిళ బాధ్యతలు వాణికే!

పార్టీ అనుబంధ విభాగాలైన తెలుగు మహిళ జిల్లా అధ్యక్షురాలిగా అంచెల వాణి, ఎస్సీ సెల్ జిల్లా అధ్యక్షునిగా బద్దెపూడి రవీంద్ర, బిసి సెల్ జిల్లా అధ్యక్షునిగా అన్నం దయాకర్‌గౌడ్, తెలుగు రైతు జిల్లా అధ్యక్షునిగా రాపూరు సుందరరామిరెడ్డిలను నియమించారు.

# నెల్లూరు మీడియాలో వార్!

## ప్రింట్, ఎలక్ట్రానిక్ వర్గాలుగా విడిపోయారు



వివాదాలకు కేంద్ర బిందువు నెల్లూరు ప్రెస్‌క్లబ్.

అందరి గుట్టుమట్లను బహిరంగపరిచే నెల్లూరు మీడియాలోనూ పెద్ద యుద్ధమే జరుగుతుంది. గత పదిహేనేళ్లుగా కలసిమెలసి ఉంటున్న ప్రింట్ మీడియా, ఎలక్ట్రానిక్ మీడియాలు విడిపోయాయి. ఎవరికి వారుగా ప్రత్యేక సంఘాలు పెట్టుకొని కొత్త నాయకులను ఎన్నుకొన్నారు. జర్నలిస్టులలో నాలుగైదు సంఘాలున్నా వీటిలో పెద్ద సంఘం ఎపియూడబ్ల్యుజె. ఈ సంఘంలోనే ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియాలో పనిచేసే జర్నలిస్టులు, కెమెరామెన్లు సభ్యులుగా ఉండేవారు. జర్నలిస్టు సంఘంలోని ప్రాథమిక సూత్రాలు తెలియని కొందరు సభ్యులు ఇటీవల మరో యూనియన్ ఎపియూజెయూ చేసిన సన్మానానికి ఒప్పుకోవడంతో లుకలుకలు మొదలయ్యాయి. ఎపియూడబ్ల్యుజె అధ్యక్షుడు భాస్కర్‌రెడ్డి ఈ వ్యవహారమై ఎలక్ట్రానిక్ మీడియా ప్రతినిధులకు నోటీసులు జారీచేసి లిఖితపూర్వక వివరణ అడగడంతో లోలోన పెద్ద జగడమే జరిగింది. అనంతరం ఎలక్ట్రానిక్ మీడియాగా కొత్త సంఘం ఏర్పడింది. ఈ సంఘానికి ఎన్‌టివి జిల్లా విలేఖరి విజయ్ అధ్యక్షుడు. మహాటీవీ గౌస్ లాజం, ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. దరిదాపులు ఎలక్ట్రానిక్ మీడియాలో పనిచేసే వారంతా ఈ సంఘంలో చేరిపోవడంతో ముందే బాగా బలహీన పడిపోయి ఉన్న ఎపియూడబ్ల్యుజె మరింత ఢీలా పడింది. ఈ పరిణామాలకు అసలు సభ్యులేలేని, వ్రాయని భాస్కరులు ఎక్కువగా ఉండే జాప్, ఎపియూజెయూ నేతలు సంతోష పడుతున్నారు. కొద్దోగొప్పో రాయగల జర్నలిస్టులుండే ఎపి జర్నలిస్టుల ఫెడరేషన్ జిల్లాలో తనకుతానుగా వెనుకబడిపోవడంతో రకరకాల వ్యాపారాల్లో ఉండే వ్యక్తులు జర్నలిస్టులుగా మార్కెట్‌లో రాజ్యమేలుతున్నారు.

# ఒంటరైన ఒంటేరు

## ఆత్మ విమర్శ చేసుకోవాలి

తెలుగుదేశం పార్టీలో ఒకప్పుడు ముఖ్య నేతగా వెలిగిన ఒంటేరు వేణుగోపాల్‌రెడ్డి ఒంటెద్దు పోకడలతో తనకు తానే పార్టీకి దూరమైపోయారు. తెలుగుదేశం పార్టీ జిల్లా కొత్త కార్యవర్గాన్ని ప్రకటించాక తాను తెలుగుదేశం పార్టీకి ఎప్పుడో రాజీనామా చేశానని ఆయన ప్రకటించడం చర్చనీయాంశమైంది. రెండు నెలల క్రితమే తాను పార్టీ సర్వాధినేత చంద్రబాబు నాయుడికి రాజీనామా పత్రం ఇచ్చేశానని చెబుతున్నారాయన. ఇది జరిగాక ఇటు చంద్రబాబుగానీ అటు జిల్లా పార్టీ ప్రముఖులు గానీ తనతో సంప్రదింపులే జరపలేదన్నారు. పార్టీ కొత్త కార్యవర్గంలో తన అనుచరులెవరూ లేరని, ఈ కార్యవర్గంలో నూతన అధ్యక్షునిగా బీద రవిచంద్ర ఎన్నిక కావడం మినహా మరో కొత్తదనం లేదని పెదవి విరిచారాయన.

వేణుగోపాల్‌రెడ్డికి చంద్రబాబుతో సాన్నిహిత్యం ఉండడం వల్ల ఆయన ఒకసారి కావలి ఎమ్మెల్యే, మరోసారి నెల్లూరు ఆర్టీసి రీజినల్ ఛైర్మన్‌గా పనిచేయగలిగారు. 2 సార్లు నెల్లూరు పార్లమెంటు స్థానానికి తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయారు. మొన్నటి ఉప ఎన్నికల్లో డిపాజిట్ దక్కకపోవడం ఆయనను బాధ పెట్టింది. కావలిలో బీద మస్తాన్‌రావు తిరుగులేని నాయకుడిగా ఎదగడం, ఆయన సోదరుడు రవిచంద్ర పార్టీ జిల్లా అధ్యక్షుడు కావడంతో సహజంగానే ఆయనకు సీటు సమస్య వచ్చి పడింది. వైఎస్ఆర్ కాంగ్రెస్‌లోకి వెళ్దామంటే రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, కాంగ్రెస్‌లోకి వెళ్దామంటే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి పెద్ద అడ్డంకిగా మారడంతో ఆయన సహజసిద్ధంగా ఉద్వేగానికిలోనై తెలుగుదేశంకు రాజీనామా గీకిపారేశాడు. వ్యక్తిగతంగా ఎంతో మంచి పేరున్న వేణుగోపాల్‌రెడ్డి చీటికి మాటికి అలగడమే ఆయన వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని దెబ్బతీసింది.

# ఏం కొనేటట్లు లేదు... తినేటట్లు లేదు!

## నిత్యావసరాల ధరలు పైపైకి...

ఏం కొనేటట్లు లేదు... ఏం తినేటట్లు లేదు అని ఓ సినీ కవి ఏ ముహూర్తాన వ్రాశాడో కానీ నేటి పరిస్థితికి అతికినట్లు సరిపోతుంది. ప్రతి వస్తువు ధర పెరిగిపోవడంతో సాధారణ, మధ్యతరగతి కుటుంబాలపై ఆర్థిక భారం పడుతోంది. కూరలు, పాలు కొనే పరిస్థితి లేదు. కరెంటు బిల్లులు షాక్ కొడుతున్నాయి. వంట గ్యాస్‌పై సబ్సీడీ కుదించడం, సిలిండర్ల సరఫరాపై ఆంక్షలు పెట్టడంతో వంట చేయాలంటే గృహిణులు భయపడాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. వినాయకచవితితో పండుగల సీజన్ మొదలయ్యింది. దీంతోపాటే ధరల పెరుగుదల ఆరంభమైంది. నిత్యావసర వస్తువులు మొదలు ప్రతి వస్తువు ధర పెరగడంతో పేద, మధ్యతరగతి కుటుంబాలు దిక్కుతోచని స్థితిలో ఉన్నాయి. పప్పులు, బియ్యం, కూరల ధరలు రోజురోజుకు పెరిగిపోతుండడంతో ఏం కొనాలో? ఏం తినాలో?? తెలియక సతమతమై పోతున్నారు సామాన్య ప్రజలు. పండుగ నాడైనా పిండి వంటలు చేసుకోవాలని ఉన్నా ధరలు ఆ ఆశపై నీళ్లు చిలకరిస్తున్నాయని వాపోతున్నారు గృహిణులు. పండుగ సీజన్ కావడంతో పూల ధరలకు రెక్కలొచ్చాయి. దేవుళ్లకు అలంకరించేందుకు పూలు కొనాలన్నా ఆలోచించాల్సిన పరిస్థితి ఎదురౌతోంది. అసలే వస్తువుల ధరలు పెరిగి అల్లాడుతున్న జనం నెత్తిపై ప్రభుత్వం డీజిల్ ధరలను పెంచి పెద్ద భారం మోపింది. దీంతో రవాణా ఛార్జీలు పెరిగి ఆ ప్రభావం అన్ని వస్తువులపై పడి ధరలు మరింత పైకి ఎగబ్రాకాయి. బస్సు ఛార్జీలు పెరగడంతో సామాన్యుల పరిస్థితి అగమ్యగోచరంగా మారింది. ఇక ప్రభుత్వం ప్రజలపై వేసిన పిడుగులాంటి భారం గ్యాస్ సిలిండర్ల నియంత్రణ. సబ్సిడీపై ఇచ్చే గ్యాస్ సిలిండర్లలో కోత విధించింది. ఇకపై ఏడాదికి ఆరు సిలిండర్లను మాత్రమే సబ్సిడీపై సరఫరా చేస్తామని, అంతకుమించి కావలసి వస్తే సబ్సిడీ లేకుండా పూర్తి ధర చెల్లించి కొనుగోలు చేయాలనే నిబంధన విధించడంతో వంట కూడా మంటలు పుట్టిస్తోంది. ప్రభుత్వం నిత్యావ సర వస్తువుల ధరలను నియంత్రించలేక పోవడం, మరోవైపు డీజిల్ ధరలు పెరగడం, గ్యాస్ సిలిండర్ల కోత పెట్టడంతో ప్రజలందరూ ఆర్థిక భారంతో అతలాకుతలం అవుతున్నారు.



అంటకాగుతున్న నూనె, పప్పుల ధరలు.

# పదవుల కోసం ప్రాకులాడను!

## నేదురుమల్లి రామ్‌కుమార్‌రెడ్డి స్పష్టీకరణ



కార్యకర్తలకు ఎల్లవేళలా అండగా నిలుస్తానని, స్థానిక సమస్యల పరిష్కారానికి తన వంతు కృషి చేస్తానని పిసిసి కార్యవర్గ సభ్యుడు నేదురుమల్లి రామ్‌కుమార్ తెలిపారు. పదవుల కోసం ప్రాకులాడే అలవాటు లేదని, తన తండ్రియైన నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ఆశయాలకు అనుగుణంగా సేవా కార్యక్రమాలు నిర్వహిస్తానన్నారు. వాకాడులోని నివాసంలో ఆయన ఇష్టాగోష్టి నిర్వహించారు. ఈ సందర్భంగా హాజరైన పలువురు ప్రముఖులు, కాంగ్రెస్‌పార్టీ నేతలు, కార్యకర్తలనుద్దేశించి మాట్లాడారు. కొంతకాలంగా తండ్రి అనారోగ్యం కారణంగా కార్యకర్తల్లో, అనుచరుల్లో కొంత ఆందోళన కల్గిన మాట వాస్తవమేనన్నారు. జనార్దన్‌రెడ్డి ఆరోగ్య విషయంలో ఎలాంటి భయాలు, ఆందోళన చెందాల్సిన అవసరం లేదని, ఆయన కుమారునిగా ప్రజా అవసరాల దృష్ట్యా అన్నింటా ముందుంటానని, అండగా నిలుస్తానని కార్యకర్తలకు, అనుచరులకు భరోసా ఇచ్చారు. త్వరలో నియోజకవర్గ స్థాయిలో కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల విస్తృత సమావేశం ఏర్పాటు చేసి స్థానిక సమస్యలపై దృష్టి పెడతామన్నారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎఎంసి ఛైర్మన్ కొడవలూరు దామోదర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# ముత్తుకూరు పంచాయితీలో నిధుల స్వాహా!

ముత్తుకూరు మేజర్ గ్రామ పంచాయితీ. పుష్కలంగా వనరులు, రెవెన్యూపరంగా రిజిస్ట్రేషన్ ఇతరత్రా మార్గాలలో ఆదాయం వస్తుంటుంది. ఎందరో సర్పంచ్‌లుగా నీతి నిజాయితీలతో పనిచేసి పేరు ప్రఖ్యాతులు గడించారు. అలాంటి పంచాయితీలో ఉన్నతాధికారుల పర్యవేక్షణ కొరవడడం, సిబ్బంది చేతివాటం కారణంగా 2009 నుంచి ఇప్పటివరకు పలు అవకతవకలు జరిగి దాదాపు 50 లక్షల రూపాయలు దుర్వినియోగం అయినట్లు తెలుస్తోంది. ఇన్‌చార్జిగా పనిచేసిన కార్యదర్శి ఈ నిధులను ఆరగించడంలో ప్రధానపాత్ర పోషించినట్లు ఆరోపణలు వినవస్తున్నాయి. పంచాయితీలలో రెండువేల రూపాయలకు మించి ఖర్చు చేయాలంటే పంచాయితీ ఆమోదం ద్వారా సంబంధిత శాఖల అధికారులు ఎస్టిమేషన్లు రూపొందించి మెజర్‌మెంట్ బిల్లుల ద్వారా ఖర్చు చేయాల్సి వుంటుంది. దానికి పక్కాగా ఓచర్లు అందచేయాలి. ఇలాంటివేమీ లేకుండా కార్యదర్శులు చేతివాటం ప్రదర్శించి పంచాయితీకి రావాల్సిన సొమ్మును బొక్కేస్తుండడంతో లక్షల రూపాయలు లెక్కతేలకుండా పోతున్నాయి. అక్రమ లేఅవుట్లు, కట్టడాలు పంచాయితీ అనుమతులు లేకుండానే జరిగిపోతున్నా వాటి వైపు దృష్టిసారించేవారే లేకుండా పోతుండడంతో మూడు అక్రమాలు, ఆరు అవకతవలుగా మారింది ముత్తుకూరు పంచాయితీ.

# మూతపడ్డ బియ్యం కేంద్రాలు

పౌరసరఫరాలశాఖ ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన బియ్యం విక్రయ కేంద్రాలు మూణాళ్ళ ముచ్చటగా మారాయి. సామాన్య ప్రజల అవసరాలను దృష్టిలో వుంచుకొని జిల్లావ్యాప్తంగా మండల కేంద్రాల్లో ఈ బియ్యం విక్రయ కేంద్రాలను ఏర్పాటు చేశారు. అధికారుల పర్యవేక్షణ లేకపోవడం, బియ్యం సరఫరా జరగకపోవడంతో బియ్యం విక్రయ కేంద్రాలు మూతబడ్డాయనేందుకు సూళ్లూరుపేట పట్టణం ఉదాహరణ. జూలై 16న ఇక్కడి కచ్చేరివీధిలో పౌరసరఫరాలశాఖ అధికారులు ఆర్భాటంగా బియ్యం కేంద్రాన్ని ప్రారంభించారు. ప్రజల అవసరాలను దృష్టిలో వుంచుకొని ఈ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నట్లు ఉపన్యాసాలు దంచారు. రైస్‌మిల్లర్లు మొక్కుబడిగా అతికష్టం మీద బియ్యాన్ని సరఫరా చేస్తూ వచ్చారు. ఇక్కడి నుంచి ప్రజలు తక్కువ ధరకు బియ్యాన్ని కొనుగోలు చేస్తున్నారు. ప్రజలకు అందుబాటులో వున్న ఈ కేంద్రాన్ని వున్నట్లుండి అక్టోబర్ 16 నుంచి మూసేశారు. ఎందుకు మూసేశారో అధికారులు సమాధానం చెప్పడం లేదని వినియోగదారులు ఆరోపిస్తున్నారు. ఎందుకు బియ్యం కేంద్రం తెరచారో, ఎందుకు మూసేశారో జనానికి అర్థం కావడం లేదు.

● కొండ బిట్రగుంటకు

# వెళ్లాలంటే ఎన్నో తిప్పలు!

బిలకూటక్షేత్రమైన కొండ బిట్రగుంటలోని ప్రసన్న వెంకటేశ్వరస్వామి దర్శనానికి వచ్చే భక్తులకు ఆకతాయిల నుంచి వేధింపులు ఎదురౌతున్నాయి. ముఖ్యంగా ఒంటరిగా వెళ్లే మహిళలు, భార్యభర్తలపై దారి కాచి వుండే పోకిరి ముఠాలు అసభ్యంగా మాట్లాడుతూ, వెకిలి చేష్టలకు పాల్పడుతుండడంతో ఆలయానికి వచ్చే వాళ్లు హడలిపోతున్నారు. మరోవైపు దొంగల భయం వెన్నాడుతోంది. వెంకటేశ్వరస్వామి దర్శనం కోసం జిల్లా నలుమూలల నుంచి భక్తులు అధికసంఖ్యలో వస్తుంటారు. బస్సులో ముంగమూరు తోటల వరకు చేరుకొని అక్కడ నుంచి ఆటోలలో గుడి వద్దకు వెళ్లాల్సి వుంటుంది. పగటి పూట మాత్రమే ఆటోలు వుండడంతో సాయంత్రం వేళల్లో గుడికి వచ్చే

**దారిలో దొంగలు - పోకిరీలను దాటితేనే ప్రసన్నుడి దర్శనం**

భక్తులు నడచిపోవాల్సిందే. దీంతో మార్గ మధ్యంలో గల జామాయిల్ చెట్ల వద్ద దొంగలు కాపుకాచి ఆలయానికి వెళ్లే భక్తులను దోచుకొంటుండడంతో ఇక్కడకు వెళ్లాలంటేనే భయభ్రాంతులకు గురౌతున్నారు. ఇటీవల ఇలాంటి ఘటనలు ఎన్నో జరిగాయి. ఇంత జరిగినా పోలీసులకు ఫిర్యాదు చేయాలంటే తిప్ప పోలీస్‌స్టేషన్‌కు పది కిలోమీటర్లు పోవాల్సి వుండడంతో అంతదూరం వెళ్లలేక ఫిర్యాదు చేయకుండా మానుకొంటున్నారు. కొండ బిట్రగుంటకు వెళ్లే మార్గంలో లైట్లు వుండడం లేదని, ఆకతాయిలు, దొంగల భయం కారణంగా గుడికి వెళ్లలేక పోతున్నామనిభక్తులు వాపోతున్నారు. ఈ పరిస్థితులను దృష్టిలో వుంచుకొని ఇక్కడకు వచ్చే భక్తులకు తగిన భద్రత కల్పించాలని, పోలీస్ ఔట్‌పోస్టును ఏర్పాటు చేయాలని పలువురు కోరుకొంటున్నారు.

# కురుగొండ్ల చెప్పిన వారికే పదవులు!

● వెంకటగిరి తెలుగు రాజకీయం

వెంకటగిరి నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ మండల కమిటీలను ఏర్పాటు చేశారు. స్థానిక ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ ఆధ్వర్యంలో ఈ కమిటీలు ప్రకటించబడ్డాయి. వెంకటగిరిలో జరిగిన తెలుగుదేశం పార్టీ సమావేశంలో నూతన కమిటీలను ఎన్నుకొన్నారు. కలువాయి మండల పార్టీ అధ్యక్షునిగా గోనుగుంట వెంకటేశ్వర్లు, రాపూరు మండలానికి గంగోటి ఆనందరావు, డక్కిలికి పోలంరెడ్డి వెంకటరెడ్డి, బాలయపల్లికి రాయి మస్తాన్‌నాయుడు, వెంకటగిరి రూరల్ అధ్యక్షునిగా రమణయ్యనాయుడును నియమించారు. పట్టణ అధ్యక్షునిగా బీరం రాజేశ్వరరావు, తెలుగు యువత అధ్యక్షుడిగా కెవికె ప్రసాద్‌నాయుడు ఎంపికయ్యారు. రాపూరు, డక్కిలి, సైదాపురం మండలపార్టీ అధ్యక్షుల నియామకంలో కొంత వాదోపవాదాలు జరిగాయి. ఎమ్మెల్యేతోపాటు సీనియర్ నేత చెలికం శంకర్‌రెడ్డి ఈ సమావేశంలో పాల్గొని కమిటీలను ఎంపిక చేశారు.

● వల్లివేడు బెటాలియన్

# స్కూల్‌లో మధ్యాహ్న భోజనం!

## మాట నిలబెట్టుకొన్న కలెక్టర్

వెంకటగిరి సమీపంలో గల వల్లివేడు 9వ పోలీస్ బెటాలియన్ పాఠశాలలో కొత్తగా మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రారంభించారు. అక్టోబర్ 13వతేది నుంచి ఇక్కడి విద్యార్థులకు మధ్యాహ్న భోజనాన్ని అందిస్తున్నారు. కొన్ని నెలల క్రిందట జిల్లా కలెక్టర్ ఈ పాఠశాలను సందర్శించినపుడు ఈ పాఠశాల విద్యార్థులకు మధ్యాహ్న భోజన పథకం అమలయ్యేలా కృషి చేస్తానని హామీ ఇచ్చారు. దానికి అనుగుణంగానే ఈ పథకం వర్తించేలా చర్యలు చేపట్టారు. ఈ సందర్భంగా బెటాలియన్ కమాండెంట్ నాగూర్‌రెడ్డి మాట్లాడుతూ కలెక్టర్ కృషితో పిల్లలకు మధ్యాహ్న భోజన పథకం మంజూరైందనే సంతోషం వ్యక్తం చేశారు. బెటాలియన్ సిబ్బంది పిల్లలే కాకుండా చుట్టుప్రక్కల గ్రామాల పిల్లలు ఈ పాఠశాలలో చదువుతున్నందున మధ్యాహ్న భోజనం అవసరం ఎంతో వుందన్నారు. కలెక్టర్ చొరవతో పిల్లలందరికి భోజనం లభిస్తున్నదన్నారు.



నెల్లూరు పొగతోటలోని ప్రభవ తొలిబడిలో దసరా సందర్భంగా బతుకమ్మకు అలంకరణ.



నెల్లూరు స్వర్ణకారుడు ముసవ్వీర్ దసరాను పురస్కరించుకొని మహిషాసుర మర్దిని అవతారంలో అమ్మవారిని కేవలం 500 మిల్లీగ్రాముల బంగారంతో రూపొందించిన దృశ్యం. ఇన్‌సెట్‌లో ముసవ్వీర్.



గూడూరు కర్నాలవీధిలో దసరా పండుగ సందర్భంగా జరిగిన జెండా ఉత్సవం.

● వెంకటగిరి

# పోలేరమ్మ ఆదాయం పెరిగింది!

## ఈసారి హుండీ కలెక్షన్ ఆరు లక్షలు

వెంకటగిరి గ్రామశక్తి పోలేరమ్మ జాతర ద్వారా దేవాదాయశాఖకు అధికంగా హుండీ ఆదాయం లభించింది. ఇటీవల జరిగిన పోలేరమ్మ జాతర సందర్భంగా 6,15,571 లక్షల రూపాయలు హుండీ ద్వారా ఆదాయం సమకూరింది. గత ఏడాది 5,50,836 లక్షల రూపాయలు కాగా ఈ ఏడాది 64,735 రూపాయలు అదనంగా వచ్చింది. వెంకటగిరి పోలేరమ్మకు ఏటికేడాది ఆదాయం పెరుగుతుండడం ఆమె పట్ల భక్తుల్లో గల విశ్వాసానికి నిదర్శనం. జాతరకు వచ్చే భక్తుల సంఖ్య పెరుగుతోంది. 2002లో హుండీ రాబడి 2,10,000కాగా ఈ ఏడాది ఏకంగా ఆరు లక్షల రూపాయలు వచ్చింది. ఈ ఏడాది అధికారులు జంతుబలుల నిషేధంపై విపరీతమైన ప్రచారం జరిపినా జనం భక్తి విశ్వాసాల నుంచి దూరం చేయలేకపోయారు. మొత్తం మీద వెంకటగిరి పోలేరమ్మకు భక్తుల నుంచి అధికంగా విరాళాలు అందుతున్నాయి. అయినా జాతర ఏర్పాట్లలో మాత్రం నిర్వహణ లోపం కన్పడుతూనే వుందని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు.



నెల్లూరు పాండురంగ అన్నదాన సమాజం అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నికైన తవ్వా రంగయ్య, మెంటా నరసింహారావును సన్మానిస్తున్న ఆర్యవైశ్య సీనియర్ సిటిజన్ అసోసియేషన్ నాయకులు వెంకటకృష్ణయ్య, శేషయ్య, ప్రేమ్‌శంకర్.

## సీజనల్ వ్యాధుల పట్ల అప్రమత్తం!

### విద్యార్థులకు ఆయుర్వేద వైద్యుని సలహా

సీజనల్ వ్యాధులపై ప్రజలు అప్రమత్తంగా వుండాలని వెంకటగిరి పట్టణంలోగల బంగారుపేట ఆయుర్వేద వైద్యశాల డాక్టర్ ఓబులేసు విద్యార్థులకు సూచించారు. ఇటీవల బొప్పాపురం ప్రాథమిక పాఠశాలలో విద్యార్థులకు ఆరోగ్య సలహాలను అందజేశారు. డెంగ్యూ, మలేరియా వ్యాధులు సోకకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలన్నారు. దోమల వల్ల వచ్చే ఈ వ్యాధుల బారిన పడకుండా వుండాలంటే పరిసరాలను పరిశుభ్రంగా వుంచుకోవడంతోపాటు నీరు నిల్వకుండా చూసుకోవాలన్నారు. అనంతరం విద్యార్థులకు మందులను ఉచితంగా పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఉదయ్‌కుమార్, మాధవీలత, ప్రతాప్ తదితరులు పాల్గొన్నారు.

● అధికారులపై

## మంత్రి కస్సు బుస్సు!

### ఆత్మకూరులో ఇంటిస్థలాల పంపకానికి ఇబ్బందులు

జిల్లా అధికారులపై ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి కస్సుబుస్సులాడారు. మీకు చేతకాకపోతే చెప్పండి రాష్ట్ర అధికారులకు చెప్పి పనులు చేయించుకుంటానని ఆగ్రహించారు. ఆత్మకూరులో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలపై జరిగిన సమీక్షా సమావేశం ఇందుకు వేదిక అయ్యింది. సమావేశం ప్రారంభించిన మంత్రి ఆత్మకూరు నియోజకవర్గ ప్రజల ఇంటి నివేశన స్థలాలు మంజూరు చేయడంలో అధికారుల పాత్రను తప్పుపట్టారు. వేలాది మంది పేదలు ఇళ్ల స్థలాలకోసం ఎదురు చేస్తున్నారని, ఇంటింటి సర్వే జరిపి జాబితా రూపొందించిన అధికారులు స్థలాలు మంజూరు చేసే సమయంలో వివిధ కారణాలు చూపి అభ్యంతరం వ్యక్తం చేయడంపై మండిపడ్డారు. సమావేశానికి హాజరైన అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ ఇదేం పద్ధతని ప్రశ్నించారు. మీరు, మీ కలెక్టర్ ఏమి చేస్తారో నాకు తెలియదు. పేదలకు మాత్రం ఇంటి స్థలాలు మంజూరు చేయాలన్నారు. ప్రతిపాదిత స్థలాలు వాగు పోరంబోకులంటున్న అధికారులు గతంలో ఇవే స్థలాలకు ఎలా పట్టాలిచ్చారని ప్రశ్నించారు. ప్రైవేట్ వ్యక్తులకు, రియల్‌ఎస్టేట్ వ్యాపారులకు ఎలాంటి అభ్యంతరాలు లేకుండా ఇచ్చేస్తారా అని ఆగ్రహించారు. అధికారుల తీరు మార్చుకోకపోతే రాష్ట్ర రెవెన్యూ అధికారులను తీసుకొని వచ్చి సమస్యను పరిష్కరించుకొంటామన్నారు. మర్రిపాడులో ఫైర్‌స్టేషన్ ఏర్పాటులో జాప్యం జరుగుతోందంటూ వెంటనే దీనిని పూర్తి చేయాలని ఆదేశించారు.

## ఆయుష్ ఉద్యోగుల పస్తు!

ఎనిమిది నెలలుగా జీతాలు అందక ఆయుష్ ఉద్యోగులు పస్తులుండాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. కేంద్రప్రభుత్వం జాతీయ గ్రామీణ ఆరోగ్యమిషన్ క్రింద 2008లో ఆయుష్‌కు రూపకల్పన చేసింది. ఇందులో ఆయుర్వేదం, హోమియోపతి, యునాని, న్యాచురోపతి వున్నాయి. జిల్లాలో 44 ఆస్పత్రులలో 92 మంది సిబ్బంది పని చేస్తున్నారు. ఆయుర్వేదవైద్యశాలలో ముగ్గురు డాక్టర్లు, హోమియోపతిలో ఐదుగురు, యునానిలో ముగ్గురు, నేచురోపతిలో ఒక్కరు పని చేస్తున్నారు. డాక్టర్లకు 18వేల రూపాయలను, కాంపౌండర్‌కు 9,300, స్వీపర్లకు 6,700 రూపాయల లెక్కన వేతనాలు చెల్లిస్తున్నారు. అయితే గత ఎనిమిది నెలలుగా జీతాలు చెల్లించకపోవడంతో ఆ మొత్తం70 లక్షల రూపాయలు బకాయిపడినట్లు తెలుస్తోంది. దీని గురించి ఉన్నతాధికారులకు పలుమార్లు విన్నవించినా ఫలితం లేకపోవడంతో

### ఎనిమిది నెలలుగా జీతాలు లేవు

ఆయుష్ వైద్యులు, సిబ్బంది జీతాలు రాక, కుటుంబ పోషణకు అప్పులు చేయాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. గతంలో ప్రాంతీయ ఉపసంచాలకుల ద్వారా జీతాలు చెల్లించే వారు. ఈ ఏడాది కుటుంబసంక్షేమ శాఖ కమిషనర్ సంక్షేమ సొసైటీని ఏర్పాటు చేసి, దానిని జిల్లా వైద్య ఆరోగ్య శాఖకు బదలీ చేశారు. సొసైటీ ద్వారా జీతాల బిల్లులను రెగ్యులర్‌గా పంపాల్సి వుంది. అయితే సొసైటీకి జిల్లా వైద్య ఆరోగ్య శాఖల మధ్య సమన్వయం లేకపోవడంతో జీతాలు చెల్లింపునకు ఆటంకాలు ఏర్పడుతున్నాయి. ఫలితంగా ఆయా కుటుంబాల వారు రోడ్డున పడాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. ఇప్పటికైనా జిల్లా ఉన్నతాధికారులు స్పందించి బకాయిపడిన ఎనిమిది నెలల జీతాలను చెల్లించాలని ఆయుష్ ఉద్యోగులు కోరుతున్నారు.

## వారివి కపట యాత్రలు!

### కిరణ్, బాబు యాత్రలను తప్పుపట్టిన కాకాణి

ఇందిరమ్మబాట పేరుతో ముఖ్య మంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, వస్తున్నా మీకోసం అంటూ తెలుగుదేశంపార్టీ అధినేత చంద్రబాబు నాయుడు కపట ప్రేమ ఒలకబోస్తున్నారని వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి విమర్శించారు. వారు చేస్తున్న దొంగ నాటకాలను ప్రజలు గమనిస్తూనే వున్నారన్నారు. వెంకటాచలం వచ్చిన ఆయన స్థానిక పార్టీ కార్యాలయంలో విలేకరుల సమావేశం నిర్వహించారు. వివిధ పన్నుల రూపంలో 22వేల కోట్ల భారం మోపిన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి తగుదునమ్మా అంటూ ఇందిరమ్మ బాట పేరుతో ఊరూరా తిరగడాన్ని దుయ్యబట్టారు. ఇక పాదయాత్ర చేస్తున్న చంద్రబాబు పరిస్థితి చూస్తే పగటి వేషగాళ్లు గుర్తుకొస్తున్నారని ఎద్దేవా చేశారు. చిన్నపిల్లలను ఎత్తు కోవడం, వృద్ధులతో ముచ్చటించడం, ఆచరణ సాధ్యం కాని వాగ్దానాలు ఇవ్వడం లాంటివి ప్రజలు నమ్మరన్నారు. తండ్రి ఆశయాలను నెరవేర్చేందుకు వైఎస్ కుమార్తె షర్మిళ పాదయాత్ర చేస్తుంటే దానిని కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు విమర్శించడం ఆ పార్టీల దిగజారుడుతనానికి నిదర్శనం అన్నారు. స్థానిక సంస్థల ఎన్నికలను జరిపించే ధైర్యం లేక ప్రభుత్వం వాటిని వాయిదా వేస్తున్నాదని తక్షణం ఆ ఎన్నికలను నిర్వహించాలని డిమాండ్ చేశారు. ఈ సమావేశంలో మండల కన్వీనర్ చెంచు కృష్ణయ్య, శ్రీకాంత్‌రెడ్డి, భాస్కర్‌గౌడ్, రజనీకాంత్‌రెడ్డి, ఏడుకొండలు, సుధాకర్, దయాకర్, సుబ్బరాయుడు, పద్మ నాభరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## సంక్షేమ పథకాల్లో రాష్ట్రం ఫస్ట్!

● పొదలకూరులో ఆదాల వెల్లడి

సంక్షేమ పథకాలు అమలు చేయడంలో రాష్ట్రం ముందంజలో వుందని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి తెలిపారు. పొదలకూరులో పర్యటించిన ఆయన అక్కడి మండల పరిషత్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన దీపం పథకం క్రింద గ్యాస్ పంపిణీ కార్యక్రమంలో పాల్గొన్నారు. రాష్ట్రంలో ఉన్నన్ని సంక్షేమ పథకాలు దేశంలో ఎక్కడా లేవన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణించాక ఇవన్ని ఆగిపోయాయన్ని కొందరు దుష్ప్రచారం చేస్తున్నారని ఆరోపించారు. ఇప్పటివరకు ఏ ఒక్క సంక్షేమ పథకం ఆగిపోలేదని, తప్పుడు ఆరోపణలు చేసేవారు దీనిని రుజువు చేయగలరా అని ప్రశ్నించారు. రచ్చబండ కార్యక్రమం ద్వారా అర్హులైన అందరికి రేషన్‌కార్డులు, పింఛన్లు ఇందిరమ్మ ఇళ్లు మంజూరు చేసినట్లు తెలిపారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డితో మాట్లాడి పొదలకూరులో సిమెంటురోడ్డు నిర్మాణానికి రెండు కోట్ల రూపాయలు మంజూరు చేయించినట్లు ప్రకటించారు. చాటగొట్ల వద్ద ఇళ్ల పట్టాలు పొందిన వారికి అక్టోబర్ నెలాఖరులోగా స్థలాలు చూపిస్తామన్నారు. కార్యక్రమంలో విజయ డైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి, మాజీ జడ్పీటిసి అనూరాధ, మొపూరు శ్రీనివాసులరెడ్డి, సురేష్‌కుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## మధ్యాహ్న భోజనమొద్దు!

### కొత్తూరు పాఠశాల విద్యార్థుల నిరసన

విద్యార్థుల ఆకలి తీర్చేందుకు వంట చేసిపెడుతున్న మధ్యాహ్న భోజనం నిర్వాహకురాలికి ఆ విద్యార్థుల నుంచే నిరసన ఎదురైన సంఘటన ఇందుకూరుపేట మండలం కొత్తూరు చింతోపు పాఠశాలలో జరిగింది. గత కొంతకాలంగా ఈ పాఠశాలలో చదివే 30 మంది విద్యార్థులకు వంటమనిషిగావున్న మహిళ భోజనాన్ని తయారు చేసి అందిస్తోంది. ఇటీవల ఆమె చేతిపై తెల్లటి మచ్చలు రావడంతో చూసిన విద్యార్థులు ఈ విషయాన్ని వారి తల్లిదండ్రులకు చెప్పారు. ఇదేదో అంటువ్యాధి అని అనుమానించిన వారు భోజనాన్ని తినొద్దని చెప్పడంతో పాఠశాలలో ఆ వంట మనిషి చేసే ఆహారాన్ని తినేందుకు నిరాకరించారు విద్యార్థులు. ఈ సమాచారాన్ని అందుకొన్న ఇందుకూరుపేట ఆస్పత్రి డాక్టర్ ఆ పాఠశాలకు వచ్చి వంటమనిషి చేతిపై వచ్చిన మచ్చల విషయమై పరీక్షలు జరిపి అంటువ్యాధా, మరేదైనా సమస్య అనేది నిర్ధారణ చేస్తామని అక్కడి విద్యార్థులకు, వారి తల్లిదండ్రులకు హామీ ఇవ్వడంతో వివాదం సద్దుమణిగింది.

# ఉదయగిరి ఆస్పత్రికి నిర్లక్ష్యపు జబ్బు!

## ● డాక్టర్లు రారు - అందుబాటులేని వైద్యం!

ఉదయగిరి ప్రభుత్వ ఆస్పత్రికి నిర్లక్ష్యపు జబ్బు పట్టుకొంది. వైద్యులు, వైద్య సిబ్బంది వున్న ఎవరూ సక్రమంగా విధులకు హాజరు కాకపోవడంతో ఇక్క డకు వచ్చే రోగులకు వైద్య సేవలు అందడం గగన కుసుమమయ్యింది. ఉన్నతాధికారులు పలుమార్లు వైద్య సిబ్బందిని పద్ధతి మార్చుకోమని హెచ్చరించినా, ప్రజల నుంచి నిరస నలు ఎదుర్కొంటున్నా రోగులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నా ఇక్కడ డాక్టర్లలో గాని, సిబ్బందిలో గాని ఏమాత్రం మార్పు రాకపోవడం వారి నిర్లక్ష్యాన్ని తెలియజెప్తుంది. ఈ ఆసుపత్రిలో నలుగురు ఎంబిబిఎస్ డాక్టర్లు, ఒక దంత వైద్యుడు, నర్సింగ్ సిబ్బంది వున్నారు. వీరిలో అధికభాగం డ్యూటీలు సక్రమంగా చేయరు. ఎప్పుడు హాస్పిటల్‌కు వస్తారో, ఎప్పుడు పోతారో ఎవరికి తెలియదు. దీంతో చుట్టుప్రక్కల ప్రాంతాల నుంచి వచ్చిన రోగులు వైద్యం అందక ఇబ్బందులు పడాల్సి వస్తోంది. కొన్ని సమయాలలో సకాలంలో వైద్యం అందక ప్రాణాలు పోగొట్టుకొంటున్నారు. ఇటీవల ఇలాంటి ఘటనే జరిగింది ఆస్పత్రిలో. సతీష్‌గౌడ్ అనే డాక్టర్ ఒక్కడే ఆస్పత్రిలో విధులు నిర్వహిస్తుం డడం, మిగతా వైద్యులు ఆస్పత్రికి రాకపోవడంతో రోగుల సంఖ్య అధికం అయ్యింది. డాక్టర్ గదికి రెండువైపులా రోగులు బారులు తీరారు. ఒక వ్యక్తి అనారోగ్యంతో చికిత్స పొందేందుకు అక్కడకు వచ్చి సకాలంలో వైద్యం అందని కారణంగా వున్నట్లుండి కుప్ప కూలి మరణించాడు. దీంతో కోపోద్రిక్తులైన రోగులు అక్కడ వున్న వైద్యుడితో గొడవకు దిగారు. వేలాది రూపాయలు జీతం తీసుకొంటూ వైద్యం అందించలేకపోతున్నారంటూ రోగులు ఆగ్రహించడంతో ఆస్పత్రిలో ఉద్రిక్తత చోటు చేసుకొంది. ఇప్పటికైనా అస్తవ్యస్తంగా వున్న ఆస్పత్రిని, గాడితప్పిన వైద్య సిబ్బందిని సరిదిద్దాలని మండల ప్రజలు కోరుతున్నారు.

---

## ● కోటలో తాగునీటి సమస్యపై

# ఎమ్మెల్యే దుర్గాప్రసాద్ గరం గరం!

త్రాగునీటి సమస్యను పరిష్కరించకపోతే ఆందోళన చేపడతానని గూడూరు శాసన సభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ అధికారులను హెచ్చరించారు. కోట మండలంలో తాగునీటి సమస్య అధికంగా వుండడం, ప్రజలు తీవ్రంగా ఇబ్బంది పడుతుండడంతో పలు ప్రాంతా లను పరిశీలించి ప్రజల ఇబ్బందులు తెలుసుకొన్న ఎమ్మెల్యే అనంతరం స్థానిక మండల పరిషత్ కార్యాలయంలో అధికారులతో సమావేశం నిర్వహించారు. మండలంలోని అనేక గ్రామాల్లోని ప్రజలు త్రాగునీటికి ఇబ్బంది పడుతున్నారని తెలిపారు. పలుమార్లు తనకు వినతి పత్రాలు ఇచ్చారన్నారు. దీనిపై ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులకు తెలిపి మంచినీటి సమస్య పరిష్కరించమంటే ఇప్పటివరకు ఆ దిశగా చర్యలు చేపట్టకపోవడంపై అధికారులను నిల దీశారు. ప్రజలకు అవసరమైన, ప్రధానమైన సమస్యలను పరిష్కరించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని మండిపడ్డారు. ఈ సందర్భంగా అధికారులు మాట్లాడుతూ గోవిందు పల్లిపాళెం వద్ద కొందరు ఆక్వారైతులు త్రాగునీటి పైపులైన్లను ధ్వంసం చేశారని ఎమ్మెల్యే దృష్టికి తీసుకొనిరాగా అలాంటి వారిపై చర్యలు చేపట్టాలని ఆదేశించారు. చిట్టేడు పాఠ శాలలో విద్యార్థులు మంచినీటి కోసం అవస్థలు పడుతున్నందున తక్షణం అక్కడ బోరు వేయాలని ఎంపిడిఓకు సూచించారు. అధికారులు మంచినీటి సమస్యను పరిష్కరించక పోతే ప్రజలతో కలసి ఆందోళన చేపడుతానని హెచ్చరించారు. అనంతరం మండలం లోని 182మంది పొదుపులక్ష్మి గ్రూపు సభ్యులకు మంజూరైన వంటగ్యాస్ సిలిండర్లను ఆయన పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో టిడిపి మండల అధ్యక్షుడు పాదర్తి కోటేశ్వర రెడ్డి, చంద్రశేఖర్, కృష్ణమూర్తి, ఎంపిడిఓ నారాయణరావు తదితరులు పాల్గొన్నారు.

---

# గ్రంథాలయ సంస్థకు రూ.6కోట్ల బకాయిలు!

జిల్లాలో గల వివిధ గ్రంథాలయాలకు రావాల్సిన ఆరుకోట్ల రూపాయల బకాయిలు పేరుకపోయాయి. మునిసిపాల్టీలు, పంచాయితీల నుంచి రూపాయికి ఎనిమిది పైసల వం తున సెస్ చెల్లించాల్సి వుంటుంది. అయితే గత కొన్నేళ్లుగా ఈ చెల్లింపులు జరగకపోవ డంతో సెస్ క్రింద రావాల్సిన మొత్తాలు పేరుకపోయాయి. జిల్లావ్యాప్తంగా 61 గ్రంథాలు న్నాయి. వివిధ సంస్థల నుంచి బకాయిలుపడిన ఆరుకోట్ల రూపాయలు వసూలయితే గ్రం థాలయాల అభివృద్ధికి ఉపకరిస్తుందని జిల్లా గ్రంథాలయాల కార్యదర్శి వెంకటేశ్వరరావు తెలిపారు. ఇటీవల ఆయన సంగం మండలం అన్నారెడ్డిపాళెంలోగల గడి నరసారెడ్డి స్మారక గ్రంథాలయాన్ని తనిఖీ చేశారు. ఆయన మాట్లాడుతూ కొంతకాలంగా గ్రంథాల యాలకు సెస్ రూపంలో రావాల్సిన మొత్తం ఆరుకోట్ల రూపాయలు బకాయి పడ్డాయ న్నారు. మునిసిపల్, పంచాయితీల నుంచి ఇది అందాల్సి వుందన్నారు. జిల్లావ్యాప్తంగా రావాల్సిన ఈ బకాయిలపై జాయింట్ కలెక్టర్ సమావేశాన్ని ఏర్పాటు చేయనున్నట్లు తెలి పారు. జిల్లా గ్రంథాలయాల్లో కంప్యూటర్లు ఏర్పాటు చేయడంతోపాటు ఇంటర్నెట్ సౌక ర్యాన్ని కల్పించామన్నారు. గ్రంథాలయాలలో సభ్యత్వం వున్నవారు ఒక గంటకు ఐదు రూపాయలు, లేని వారు ఒక గంటకు పది రూపాయల వంతున చెల్లించాలన్నారు.

---

# చౌకబారు రాజకీయాలొద్దు!

## సోమిరెడ్డికి ప్రసన్న సలహా!

బాధితులను, రోగులను పరామర్శించేందుకు వచ్చి చౌకబారు రాజకీయాలు చేయడం మానుకోవాలని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి హితవు చెప్పారు. ఇటీవల వేగూరులో డెంగ్యూ వ్యాధిగ్రస్తులను పరామర్శించేందుకు వచ్చిన సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి పరోక్షంగా చేసిన విమర్శలకు ఆయన ప్రతి విమర్శలు చేశారు. పరామర్శలలో రాజకీయాలు తగవని, అయినా కొందరు పనిగట్టుకొని ఆరోపణలు చేస్తున్నారన్నారు. వేగూరు గ్రామంలో పర్యటించిన ఆయన అక్కడి పారిశుధ్య పరిస్థితులపై ఆరా తీశారు. ప్రత్యేకాధికారుల పాలన కారణంగానే గ్రామాల్లో పారిశుధ్యం పడకేసిందన్నారు. స్థానికసంస్థలకు ఎన్నికలు జరగకపోవడంతో ప్రజాప్రతినిధులు లేక గ్రామాల్లో సమస్యలు పేరుకపోతున్నాయన్నారు. జిల్లా కలెక్టర్ దీనిపై దృష్టి సారించి ప్రత్యేకాధికారులకు, పంచాయితీ కార్యదర్శులకు పారిశుధ్యం విషయంలో తగిన ఆదేశాలు జారీ చేయాలన్నారు. ప్రజలు ఎవరికి వారు శుభ్రత పాటించాలని, కాచి చల్లార్చిన నీటినే త్రాగాలని సూచించారు. అనంతరం డెంగ్యూవ్యాధి సోకిన పలువురిని పరామర్శించారు. ప్రసన్నకుమార్‌రెడ్డి వెంట మండల వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ కన్వీనర్ వినోద్‌రెడ్డి, మాజీ సర్పంచ్ నరసింహారెడ్డి, రాధాకృష్ణారెడ్డి తదితరులు వున్నారు.

# ఇబ్రహీం దైవభక్తి... ఇస్మాయిల్ పితృవాక్య పరిపాలనకు స్ఫూర్తి బక్రీద్!



భారతదేశం సర్వమతాల సమ్మేళనం. ప్రతి మతానికి కొన్ని ఆచారాలు, సాంప్రదాయాలు వుంటాయి. ఆయా మతస్తులు వారి ఆచారాలకు అనుగుణంగా పండుగలను జరుపుకొంటుంటారు. ఇస్లాం మతస్తులు జరుపుకొనే ముఖ్యమైన పండుగలలో మొదటిది రంజాన్, రెండవది బక్రీద్. ఇస్లామియా క్యాలెండర్ ప్రకారం 12వ నెలలో బక్రీద్ పండుగను జరుపుకొంటారు. అంటే రంజాన్ పండుగ అయిన రెండు నెలలకు బక్రీద్ పండుగ వస్తుంది. దీనినే ఈదుల్ జుహా అంటారు. ఈదుల్ ఆదా అనే పేరు కూడా వుంది. త్యాగానికి నిదర్శనంగా జరుపుకొనే పండుగ ఇది. ఈద్ అనగా పండుగ. బకరా అంటే గొర్రె. జంతువును బలి ఇచ్చే పండుగ కాబట్టి దీనికి బక్రీద్ అనే పేరు వచ్చిందని చెప్తారు. బక్రీద్ నాడు పేదలకు ఆహారాన్ని దానం చేస్తారు. పొట్టేలు తదితర జంతువులను బలి ఇస్తారు. దీనినే ఖుర్బానీ అంటారు. దీనికి సంబంధించి పైగంబర్‌ల(దేవదూత) నాటి కథ ఒకటి చెప్పబడింది.

ఐదు వేల సంవత్సరాల క్రితం ఇరాక్ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న నమ్రూద్ రాజ్యంలో మత ప్రవక్త ఇబ్రహీం అలై సలాం దైవ సందేశాన్ని ప్రచారం చేస్తుంటారు. ఇబ్రహీం మత ప్రచారం నచ్చని రాజు అతన్ని రాజ్య బహిష్కరణ చేస్తాడు. దీంతో ఆయన దేశదిమ్మరిగా మారి ప్రజలకు న్యాయం, ధర్మ సూత్రాలను ప్రబోధిస్తూ ప్రపంచమంతా కాలినడకన తిరుగుతుంటారు. మూఢనమ్మకాలను, అజ్ఞాన ఆచారాలను సంస్కరిస్తూ దేవుని ఏకత్వాన్ని వివరిస్తూ ప్రచారం నిర్వహిస్తూ పలువురిని ఆకట్టుకొన్నాడు. వివాహమై ఏళ్లు గడిచినా సంతానం కలుగదు. సంతానం కోసం మరో వివాహం చేసుకొంటాడు. అయినప్పటికీ పిల్లలు కలుగకపోవడంతో తనకు సంతానాన్ని ప్రసాదించమని అల్లాను ప్రార్థిస్తాడు. ముసలి వయసులో అతని కోరికను మన్నించిన అల్లా పండంటి మగబిడ్డను ప్రసాదిస్తాడు. ఆ పిల్లవాడికి ఇస్మాయిల్ అని నామకరణం చేస్తారు. ఆ సమయంలో అల్లా అతనికి పరీక్ష పెడతాడు. భార్యను, లేకలేక కల్గిన బిడ్డను ఎడారిలో వదిలి రావాలని ఇబ్రహీంను ఆదేశించగా ఆ ప్రకారం వారిని ఎడారిలో వదిలేస్తాడు. తర్వాత తిరిగి కుటుంబాన్ని కలుసుకొంటాడు. ఈ క్రమంలో ఒకనాడు ఇబ్రహీం ప్రవక్త గాఢనిద్రలో వుండగా అల్లా కలలో కన్పించి కుమారుడిని బలి ఇవ్వమన్నట్లు దైవవాణి చెప్పినట్లుగా తలుస్తాడు. ఆ ఆజ్ఞను శిరసా వహించి తన బిడ్డ అయిన ఇస్మాయిల్‌ను బలి ఇవ్వడానికి సిద్ధపడి, ఈ విషయాన్ని కుమారుడికి తెలుపగా అతను అందుకు సమ్మతిస్తాడు. నిర్జన ప్రదేశానికి తీసుకెళ్లి పిల్లవాడైన ఇస్మాయిల్ మెడపై కత్తి వుంచి రెండుమార్లు నరికేందుకు ప్రయత్నించినా సఫలం కాదు. అప్పుడు ఇస్మాయిల్ తండ్రిని ఉద్దేశించి కళ్లకు గంతలు కట్టుకొని కత్తివేటు వేయమంటాడు. ఇబ్రహీం దైవభక్తికి మెచ్చిన అల్లా ఇస్మాయిల్ స్థానంలో పొట్టేలును నిలపడంతో దానిని బలి ఇస్తాడు.

ఇబ్రహీం త్యాగాన్ని మెచ్చుకొని తమ పరీక్షలో నెగ్గావని అభినందిస్తాడు. ఆకాశం నుంచి అల్లా పంపిన పొట్టేలును బలి ఇచ్చినందుకు గుర్తుగా బక్రీద్ పండుగను జరుపుకొని ఆనాటి నుంచి ఖుర్బానీ ఇస్తున్నారు. ఈ మాంసాన్ని మూడు భాగాలు చేసి ఒక భాగాన్ని బంధువులు, మిత్రులకు, రెండవ భాగాన్ని పేదలకు పంచి, మిగతా భాగాన్ని స్వంతంగా వాడుకోవడం సాంప్రదాయంగా వస్తోంది. ఖుర్బానీ చేసి పేదలకు దానం ఇవ్వడం వలన నరకం స్వర్గం మధ్య వుండే సిరాత్ వంతెన దాటి స్వర్గానికి చేరుతారని భావిస్తారు. బక్రీద్ నాడు ఈద్గాల్లో సామూహిక ప్రార్ధనలు చేస్తారు. త్వరగా నమాజ్ ముగిస్తారు. నమాజ్ పూర్తయ్యే వరకు జింక కూడా తన బిడ్డకు పాలు ఇవ్వకుండా ఒంటి కాలుపై నిలబడి వుంటుందని ప్రతీతి. ఈ సమయంలోనే హజ్ యాత్ర చేస్తారు. మక్కాను సందర్శించి అక్కడి కాబా గృహాన్ని దర్శించి దానిచుట్టూ ఏడు ప్రదక్షణలు చేస్తారు. మదీనాను దర్శిస్తారు. హజ్ యాత్ర చేయడం వలన పాపాలు తొలగి స్వర్గప్రాప్తి కల్గుతుందని నమ్మకం.

J

అవీ - ఇవీ

# ఏసి స్టేడియంలో అంధకారం!

## విద్యుత్ బకాయి ఆరు లక్షలు మరి!




ఏసి స్టేడియంలో కమ్ముకున్న చీకట్లు.

నగరంలో ఉన్న ఏసి సుబ్బారెడ్డి స్టేడియం విద్యుత్ శాఖకు చెల్లించాల్సిన బకాయిలు దాదాపు 6 లక్షల రూపాయలు. ఇటీవల విద్యుత్ శాఖ అధికారులు స్టేడియంకు విద్యుత్ సరఫరా నిలిపివేశారు. ఎటువంటి నోటీసులు లేకుండా విద్యుత్ సరఫరా నిలిపివేయడంతో అధికారులు, క్రీడాకారులు ఆందోళన చెందాల్సి వచ్చింది. దాదాపు ఏడాదికి పైగా ఏసి స్టేడియం అధికారులు విద్యుత్ బిల్లులు చెల్లించడం లేదు. సామాన్య మానవుడు ఏదైనా ఒక కారణం చేత ఒక నెల విద్యుత్ బిల్లు చెల్లించలేకపోతే మరుసటి నెలలో విద్యుత్ కనెక్షన్ తొలగిస్తుంటారు ఆ శాఖ అధికారులు. సంవత్సరం నుంచి ఏసి స్టేడియం అధికారులు విద్యుత్ బకాయిలను చెల్లించకపోతే విద్యుత్ సరఫరా ఎందుకు నిలిపివేయలేదో వారికే తెలియాలి. సంవత్సరం తర్వాత బకాయిల విషయం గుర్తుకు వచ్చి వెంటనే విద్యుత్ సరఫరా నిలిపివేశారు. దీంతో ఏసి స్టేడియం అధికారి విద్యుత్ శాఖాధికారులతో చర్చలు జరిపి విద్యుత్ సరఫరా పునరుద్దరించారు. పేరుకుపోయిన బకాయిలు ఎప్పుడు చెల్లిస్తారో స్పష్టంగా చెప్పలేక పోతున్నారు. నగరంలోని వివిధ ప్రభుత్వ శాఖలు విద్యుత్‌శాఖకు చెల్లించాల్సిన బకాయిలు లక్షల రూపాయల్లో ఉన్నాయి. వీటిని ఎప్పటిలోగా వసూలు చేస్తారో వేచి చూద్దాం!

# జీతం మంజూరుకు కమీషన్ తప్పనిసరి!

## స్త్రీ శిశు సంక్షేమశాఖ ప్రాంతీయ ఉపసంచాలకురాలి సలహా.

ప్రభుత్వ శాఖలో పనిచేస్తున్న సిబ్బందికి ప్రతినెల జీతం మంజూరు చేయాలంటే ట్రెజరీ అధికారులకు కొంత కమీషన్ ఇవ్వక తప్పదని అధికారులే అంటున్నారు. ఇందుకు ఉదాహరణ స్త్రీ, శిశు సంక్షేమ శాఖలో మూడు జిల్లాలకు ప్రాంతీయ ఉపసంచాలకులుగా విధులు నిర్వహిస్తున్న సూయిజ్ ఇటీవల చేసిన వ్యాఖ్యలను పేర్కొనవచ్చు. గతవారంలో ఒంగోలు ప్రాంతీయ ఉపసంచాలకురాలు సూయిజ్ నెల్లూరు నగర పర్యటనకు విచ్చేసిన సందర్భంగా స్త్రీ, శిశు సంక్షేమ శాఖ అధికారిణులతో గోల్డన్ జూబ్లీ హాలులో సమీక్షా సమావేశం జరిగింది. ఈ సందర్భంగా ఆమె విలేకర్లతో మాట్లాడుతున్నప్పుడు అంగన్‌వాడీ వర్కర్లకు గత మూడు నెలల నుంచి గౌరవ వేతనం అందలేదన్న విషయాన్ని ఆమె దృష్టికి తీసుకెళ్లారు. వేతనం మంజూరు కోసం, టిఏ బిల్లులు చెల్లింపు కోసం సిడిపిఓలు కమీషన్ వసూలు చేస్తున్నారని విలేకరులు ప్రస్తావించడం జరిగింది. దీనిపై స్పందించిన ఆర్‌డి ట్రెజరీ అధికారులకు కొంత నగదు ముట్టజెప్పాల్సి వుంటుందని, దీనిని సిడిపిఓలు చేతి నుంచి ఎలా పెట్టుకుంటారని చెబుతూ... అంగన్‌వాడీ వర్కర్ల నుంచి వసూలు చేయక తప్పదని సమర్థించుకున్నారు. శాఖలో జరుగుతున్న అవినీతి, అక్రమాలను నియంత్రించాల్సిన ఉన్నతాధికారిణి బిల్లులు, వేతనం చెల్లింపు కోసం కమీషన్ ఇవ్వాలని అనడంతో అందరూ అవాక్కయ్యారు. అవినీతి నిరోధక శాఖ పోస్టర్లను ముద్రించి ప్రభుత్వ శాఖల్లో ఏ పనికి కూడా లంచం ఇవ్వరాదని ఒక ప్రక్క ప్రచారం నిర్వహిస్తుండగా, మరో ప్రక్క స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆర్‌డి సూయిజ్ లంచం ఇవ్వక తప్పదన్న రీతిలో వ్యాఖ్యానించడం చర్చనీయాంశంగా మారింది. ఆర్‌డి వ్యాఖ్యలు ఆ శాఖ సిడిపిఓలు మరిన్ని అవినీతి, అక్రమాలకు పాల్పడేందుకు దోహదపడే విధంగా ఉండడం విశేషం.

## పారిశ్రామిక రంగంలో ....

# నెల్లూరీయుల కీర్తిపతాకను ఎగురవేసిన ఎన్ఆర్‌కె కుటుంబం!

**● ఐదు వేల కోట్ల రూపాయలకు బెల్జియం కంపెనీ రుట్జెర్స్‌ను కొనుగోలు చేసిన నెల్లూరు జగన్మోహన్‌రెడ్డి.**



ప్రపంచ పారిశ్రామిక పటంలో తలెత్తుక నిలబడ్డ నెల్లూరు రాధాకృష్ణారెడ్డి.

పారిశ్రామిక రంగంలో నెల్లూరీయుల కీర్తి పతాకను సమున్నతంగా ఎగురవేసే పరిణామం ఒకటి తాజాగా చోటు చేసుకొన్నది. నెల్లూరీయుడు, తన ఇంటి పేరులోనే కాక తన మనసులోనూ నెల్లూరు మీద ఎనలేని ప్రేమ పెంచుకొన్న స్నేహశీలుడు, ఎంత ఎత్తుకు ఎదిగినా ఒదిగి వుండే ఉత్తమ సంస్కారి, నిరాడంబరతకు పర్యాయపదంగా మెలిగే సుగుణశీలి, ప్రియ సిమెంట్స్ కంపెనీ స్థాపకుడు నెల్లూరు రాధాకృష్ణారెడ్డి, ఆయన కుమారులు జగన్మోహన్‌రెడ్డి, సుజిత్‌కుమార్‌రెడ్డి కలిసి బెల్జియం దేశానికి చెందిన రుట్జెర్స్ అనే కంపెనీని కొనుగోలు చేశారు. దాని విలువ దాదాపు ఐదువేల కోట్ల రూపాయలు. జివికె తర్వాత ఒక నెల్లూరు పారిశ్రామిక కుటుంబం ఈ స్థాయిలో అంతర్జాతీయ కొనుగోలు ఒప్పందాలు చేసుకోవడం ఇదే ప్రథమం.

ఎన్ఆర్‌కెగా సుపరిచితుడైన నెల్లూరు రాధాకృష్ణారెడ్డి నిశ్శబ్ద పారిశ్రామికుడు. కాంట్రాక్టర్‌గా జీవితం ఆరంభించి, ముప్పయ్యేళ్ల క్రితం ప్రియ సిమెంట్స్ సంస్థను స్థాపించారాయన. అప్పట్లో సిమెంట్ కంపెనీ పెట్టాలంటే ప్రభుత్వ లైసెన్స్ తప్పనిసరి. మాజీ ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తన కోసం తెచ్చుకొన్న సిమెంట్ పరిశ్రమ లైసెన్స్‌ను ఎన్ఆర్‌కెకు విక్రయించారు. చాలా చిన్నదిగా మొదలైన పరిశ్రమ అది. పైపెచ్చు చాలా సంవత్సరాల పాటు నష్టాలలో, కష్టాలలో నడిచింది. ఆయన కుమారుడు ఎన్.జగన్మోహన్‌రెడ్డి తండ్రిని మించిన తనయుడు. చదువు పూర్తి అయిన తర్వాత తాను స్వంతంగా ఒక పరిశ్రమ పెట్టాలనే ఉద్దేశంతో దాదాపు ఆరేళ్లపాటు ప్రభుత్వ అనుమతులకు, బ్యాంకు అప్పుల కోసం ఓపికగా తిరిగాడు. ఇప్పటి యువతరంలో అటువంటి ఓర్పు, నేర్పు వెతికినా కన్పించవు. ఆరేళ్ల శ్రమ తర్వాత విశాఖపట్నం ఓడ రేవు ప్రాంగణంలో స్థాపించిన రెయిన్ కాల్సినింగ్ కోక్ పరిశ్రమ మొదట మొదట చాలా ఒడిదుడుకులు ఎదుర్కొన్నది. మరొకరైతే ఆ దశలోనే దాన్ని ఖాళీగా పెట్టి ఇతర వ్యాపకాలకు వెళ్లిపోయి వుండేవారు. కానీ జగన్మోహన్‌రెడ్డిది ఉడుం పట్టు. ఎన్నో ఏళ్ల ప్రయాస తర్వాత ఆ పరిశ్రమను లాభసాటి వ్యాపకంగా మలచాడు. అక్కడ నుంచి ఆయన దృష్టి సమస్తం ఆ ఒక్క పరిశ్రమ మీదనే కేంద్రీకరించడం మరొక విశేషం. అర్జునుడికి చెట్టు మీద పిట్ట కన్ను మాత్రమే కన్పించినట్లు, జగన్మోహన్‌రెడ్డికి కాల్సినేట్ కోక్ ఒక్కటే ధ్యాస, శ్వాస అయ్యింది. అల్యూమినియం తయారీకి ప్రధాన ముడి పదార్ధం ఇది. పెట్రోలియం రిఫైనరీలలో మిగిలిపోయే వృధా పదార్ధమైన గ్రీన్ పెట్రోలియం కోక్‌ను కాల్సినేషన్ అనే ప్రక్రియ ద్వారా కాల్సినేటెడ్ కోక్ తయారు చేస్తారు. తర్వాత తర్వాత జగన్మోహన్‌రెడ్డి ప్రపంచవ్యాప్తంగా కాల్సినేట్ కోక్ తయారీ పరిశ్రమలు చాలానే కొనుగోలు చేశాడు. ప్రపంచం మొత్తం మీద ఈ ఉత్పత్తిలో 9శాతం మార్కెట్ వాటా సంపాదించాడు. ఈ రంగంలో అంతర్జాతీయంగా రెండవ స్థానం పొందాడు. ఒక్క అమెరికాలోనే ఈ తరహా ఉత్పత్తి కేంద్రాలు 8 వున్నాయి వీరికి.

కొంతకాలం క్రితం ప్రియ సిమెంట్స్ పరిశ్రమను కూడా రెయిన్ కమొడిటీస్ కంపెనీలో విలీనం చేశారు. దాదాపు 29 లక్షల టన్నుల సిమెంట్ ఉత్పత్తి సామర్ధ్యం వుంది వీరికి. ఒక చిన్నపాటి విద్యుత్ కర్మాగారం కూడా నడుపుతున్నారు.

అయితే ఎన్ఆర్‌కె కుటుంబం అంత విస్తృతంగా వ్యాపించిన పారిశ్రామికులని పక్క ఇంటి వాడికి కూడా తెలియదు. అంత గుంభనంగా తమ పని తాము చేసుకపోవడం ఒక్క ఎన్ఆర్‌కెకే చెల్లు. చూద్దామన్నా జగన్మోహన్‌రెడ్డి కానీ, మరొక కుమారుడు సుజిత్‌కుమార్‌రెడ్డిది కానీ ఫోటో కూడా కన్పించదు ఎక్కడా. వారిద్దరినీ వ్యక్తిగతంగా కలిసిన వారు నెల్లూరు జిల్లాలో వేళ్ల మీద లెక్కపెట్టే సంఖ్యలోనే వుంటారంటే, ఎన్ఆర్‌కె తన కుటుంబాన్ని రెక్కల క్రింద పిల్లలను దాచుకొనే కోడిపెట్ట వలె ఎట్లా పదిల పరచుకొన్నాడో అర్ధం చేసుకోవచ్చు.

ఇప్పుడు ఒక్కసారిగా ఎన్ఆర్‌కె పారిశ్రామిక ఉత్పత్తి వెలుగులోకి వచ్చింది. బెల్జియం దేశానికి చెందిన "కోల్ తార్ పిట్చ్" అనే పదార్ధాన్ని తయారు చేసే కంపెనీని దాదాపు 5వేల కోట్లిచ్చి కొనుగోలు చేశారు వీరు. కోల్ తార్ పిట్చ్ అనే పదార్ధం బొగ్గును గ్యాస్‌గా మార్చే ప్రక్రియలో ఉత్పత్తి అవుతుంది. దానికి చాలా ఉపయోగాలున్నాయి. రోడ్లకు వేసే పెట్రోలియం తారు బదులుగా వాడవచ్చు. బాయిలర్‌ను మండించడానికి డీజిల్ బదలుగా వాడవచ్చు. రంగుల తయారీలో వాడుతారు. తలలో వచ్చే పేలు, చుండు నివారణకు దీనితో మందులు తయారు చేస్తారు. సొరియాసిస్ అనే రోగానికి కూడా దీనితో మందు తయారు చేయవచ్చు. షాంపూలు, డిటర్జెంట్ సబ్బులలో కూడా దీని ఉపయోగం వుంది. వీటన్నిటికంటే ముఖ్యంగా అల్యూమినియం తయారీలో కాల్సినేట్ కోక్ తర్వాత మరొక ముఖ్య పదార్ధం ఈ కోల్ తార్ పిట్చ్. ఆ ఉద్దేశంతోనే జగన్మోహన్‌రెడ్డి ఈ పరిశ్రమ కొనుగోలుకు సాహసించాడు. అల్యూమినియం తయారీకి కావల్సిన రెండు ముఖ్యమైన ముడిపదార్ధాలను తానే సరఫరా చేయగలగడం ద్వారా ఆ రంగంలో ప్రపంచస్థాయికి చేరుకోవచ్చన్నది ఆయన లక్ష్యం.

ఎన్ఆర్‌కె కుటుంబం తీసుకొన్న ఈ కొనుగోలు నిర్ణయం దేశవ్యాప్తంగా పారిశ్రామిక వర్గాలలో పెద్ద సంచలనమే సృష్టిస్తున్నది. అంత సొమ్ము సేకరించే సామర్ధ్యం వారికి వుందని ఎవరూ వూహించలేకపోవడమే అందుకు కారణం. అయితే గత కొన్నేళ్లుగా ఒక పథకం ప్రకారం ఇంత భారీ కొనుగోలుకు సరిపడా నిధులు సమీకరణకు ప్రణాళిక వేసుకొని మరీ ఈ సాహసానికి పూనుకొన్నారు వారు. రెయిన్ కమొడిటీస్ కంపెనీలో దాదాపు 1679 కోట్ల రూపాయల మిగులు నిధులున్నాయి. గతంలో అమెరికాలోని కాల్సినేట్ కోక్ పరిశ్రమల కొనుగోలు కోసం ఆర్థిక సంస్థల దగ్గర తీసుకొన్న అప్పులను మెల్ల మెల్లగా తీర్చుకొంటూ వచ్చారు. అందువల్ల ఇంత భారీ కొనుగోలు ఆర్థిక మద్దతు ఇవ్వడానికి సిటీ బ్యాంక్ వంటి అంతర్జాతీయ సంస్థలు ఉదారంగా ముందుకు వస్తున్నాయి.

ఎన్ఆర్‌కె స్వగ్రామం – బుచ్చిరెడ్డిపాళెం దగ్గరున్న కాగులపాడు. నలభై ఏళ్ల క్రితం రాపూరు తాలూకా మద్దూరుపాడులో నక్సలైట్ల సంచలనాత్మక దాడిలో చనిపోయిన నెల్లూరు వెంకటరెడ్డి ఆయన పినతండ్రి. నెల్లూరు నగరంలోని వెంకటరమణ సినిమా హాళ్ల త్రయానికి యజమాని ఆయనే. ఆయనకు నెల్లూరు మీద ఎక్కడలేని అభిమానం. నెల్లూరు వాసులంటే ఎనలేని ప్రీతి. నెల్లూరుకు చెందిన ఏ విషయాన్నైనా అనర్గళంగా అప్ప చెప్పే ధారణ శక్తి వుంది. పాత సినిమా కథలు విన్పించడంలో ఎన్ఆర్‌కె ఆసక్తి విచిత్రంగా వుంటుంది. అయితే తానొక పారిశ్రామికవేత్తనని కానీ, సంపన్న కుటుంబీకుడనని కానీ పొరపాటున కూడా వ్యక్తం చేయడాయన. ఆ మనో నిగ్రహం అసాధారణ విషయం. జాతీయస్థాయి పారిశ్రామిక పటంలో సమున్నత స్థానం సంపాదించుకొన్న వారి కుటుంబానికి మా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము.



సూళ్లూరుపేటలోని చెంగాళమ్మకు దసరా నవరాత్రోత్సవాల్లో భాగంగా అన్నపూర్ణ అలంకారం. చిత్రంలో పాలకమండలి ఛైర్మన్ హర్షవర్ధన్‌రెడ్డి, ఇఓ శ్రీనివాసులురెడ్డి వున్నారు.




చేసే పనులలో మార్పులు, ప్రయోజనాలుండవు కాని శుభకార్యాలలో ఆనందం. వృత్తి, వ్యాపారాలలోనివారు ఆర్థికంగా పుంజుకుంటారు. సంతానానికి పరోక్ష సహాయం, స్వయం రంగాల వారికి ఊరడింపు. ఆదాయానికి మించిన ఖర్చులు, స్నేహభావాలు తగ్గి విరోధ భావాలు పెరుగుతాయి. ఉద్యోగులకు పై అధికారుల ఒత్తిడి అధికం. విద్యార్థులు జ్ఞాపకశక్తిని పెంచుకుంటారు.




తలపెట్టిన పనులలో ఆలోచన అవసరం. ఇంటాబయటా విరోధి భావాలు పెరుగుతాయి. పరోక్షశత్రువులు ప్రత్యక్ష దాడులకు పాల్పడు సూచనలున్నాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికానుకూలతలుండడం వల్ల ఇబ్బందులుండవు. ఇంట్లో శుభకార్యాల నిమిత్తం బంధుమిత్రుల సందడి, అనవసరంగా సమయం వృధా అవడం జరుగుతుంది. ఉద్యోగులు పైఅధికారులతో జాగ్రత్తలు పాటించగలరు.




తలపెట్టిన పనులు ముందు వెనుకా జరుగుతాయి. స్త్రీలకు ప్రత్యేక ప్రయోజనాలుంటాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయాలున్నా సాహస కార్యాలకు దూరంగా వుండండి. ముఖ్యపనుల నిమిత్తం ముఖ్యులతో సంప్రదించండి. ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. కొన్నివేళల్లో మౌనం వల్ల ప్రయోజనాలుంటాయి. వ్యవసాయదారులకు ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి.




అన్ని రంగాలలో అనుకూలతలుంటాయి. ఆదాయ వ్యయాలు సమానంగా వుంటాయి. ఇంటాబయట సామాన్యానుకూలతలుంటాయి. కుటుంబంలో జరుగు శుభకార్యాలను పట్టుదలతో సాధించగలరు. సంతాన విషయంలో ప్రత్యేక శ్రద్ధ కలిగివుంటారు. వృత్తి, వ్యాపారాలు పర్వాలేదనిపిస్తాయి. నూతన గృహనిర్మాణాది కార్యాలకు శ్రీకారం చుడతారు. విద్యార్థులు చదువుపై దృష్టి పెట్టాలి.




తలపెట్టిన పనులన్నీ పూర్తవుతాయి. నూతన ఆరంభాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కోర్టు వ్యవహారాలు అనుకూలంగా వుంటాయి. నూతన వాహనాది వస్తువులు సమకూర్చుకొంటారు. తరచూ ప్రయాణాల వల్ల సమయం వృధా అవుతుంది. విద్యార్థులు తమ మృదు సంభాషణలచే తోటి విద్యార్థులను ఆకర్షిస్తారు. వ్యవసాయదారులకు తమ పనులపై మనోనిబ్బరం కలుగుతుంది.




సాధారణ ఫలితాలు, అకారణ ధన వ్యయాలుంటాయి. ఇంట్లో ఖర్చులధికం. మాటలు జాగ్రత్త వాడవలెను, దురుసుతనం పనికిరాదు. రుణబాధలు క్రమంగా తగ్గే సూచనలున్నాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో లోపాలు పెరుగుతాయి. శక్తికి మించిన కార్యాలలో తలదూర్చవద్దు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులకు అనుకూలమైన రోజులు కావు.

# వారఫలాలు

*తేది 27-10-2012 నుండి 2-11-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; కన్యలో శుక్రుడు; తులలో రవి, శనులు; వృశ్చికంలో కుజ, బుధ, రాహువులు; మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

27తేది శని త్రయోదశి.
29తేది కౌముదీ అమావాస్య, వాల్మీకి జయంతి, శరత్పౌర్ణిమ.
1తేది అట్ల తద్దె.
2తేది సంకష్ట చతుర్థి, ఆల్ సోల్స్ డే.

### శుభ ముహూర్తాలు

27, 28, 29, నవంబర్ 1, 2తేదీలలో వివాహ, గర్భదానాదీనాం, నవవధూ ప్రవేశాదీనాం, అన్నప్రాసన, సీమంతాది శుభకార్యాలకు శుభ ముహూర్తాలున్నాయి.

**అక్టోబర్ తిథులు**
**ఆశ్వయుజ శుద్ధ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 27 | శని | త్రయోదశి | రా | 09.36 | గం.ల.వ |
| 28 | ఆది | చతుర్దశి | రా | 11.15 | గం.ల.వ |
| 29 | సోమ | పౌర్ణమి | రా | 01.18 | గం.ల.వ |
| **ఆశ్వయుజ బహుళ** | | | | | |
| 30 | మంగళ | పాడ్యమి | సా | 03.39 | గం.ల.వ |
| 31 | బుధ | విదియ | | పూర్తిగా | |
| **నవంబర్ తిథులు** | | | | | |
| 1 | గురు | విదియ | ఉ | 06.15 | గం.ల.వ |
| 2 | శుక్ర | తదియ | ఉ | 08.57 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




తలపెట్టిన పనులు గతంలోవలె వుంటూ తరువాత శుభాశుభ మిశ్రమాలుగా సాగుతాయి. ఇంట్లో జరుగు శుభకార్యాలకు బంధుమిత్రుల సహాయసహకారాలుంటాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి అదనపు బాధ్యతలు ఏర్పడ్డా సమర్ధించుకొంటారు. కుటుంబంలో శాంతిసౌఖ్యాలు ఏర్పడగలవు. విద్యార్థులు తోటివారితో తమ అంతర్గత విషయాలను బహిర్గతం చేయరాదు.




చేసే పనులు వాయిదాపడడం, ఆర్థికాదాయం తగ్గ ఖర్చులు అధికమవడం వుంటుంది. వృత్తి, వ్యాపారాలలోనివారు అనుకున్న పనులు పూర్తి చేసుకోలేరు. రావలసిన బకాయిలు మొండి బకాయిలుగా మారుతాయి. వాదప్రతివాదాల వల్ల ఇబ్బందులుంటాయి. భార్యాభర్తల మధ్య మనస్పర్ధలుంటాయి. విద్యార్థులకు శ్రమకు తగిన ఫలితం వుంటుంది. రాజకీయులు స్వంతవారితో లబ్ధిపొందగలరు.




తలపెట్టిన పనులలో సామాన్యానుకూలతలు ఏర్పడి, ఆదాయం సామాన్యంగా వుంటుంది. శరీరారోగ్యలోపం. చేయని తప్పులకు ప్రతిఫలం వుంటుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థికస్థితులు నిరుత్సాహాన్నిస్తాయి. విద్యార్థుల వ్యాసంగాలకు ఆటంకాలేర్పడగలవు. కొన్ని వ్యవహారాలు వాయిదా వేసుకొనడం మంచిది. కళా, క్రీడా రంగాలలోనివారు ప్రతిష్ఠాత్మక నిర్ణయాలు తీసుకోవద్దు.




చేసే పనులలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల వారికి లాభశాతాలు పెరుగుతాయి. ఉద్యోగులకు పైఅధికారులతో మైత్రీభావం పెరుగుతుంది. కొన్ని పరిష్కారాలకు ఎదుటివారి ఎత్తులకు పైఎత్తులు వేయాలి. సమస్యలు పరిష్కారమౌతాయి. కుటుంబ వ్యక్తులతో సుఖమయ జీవనం గడపగలరు. విద్యార్థులు విద్యలలో విజయాన్ని చూడగలరు. రాజకీయులకు తెరచాటు వ్యవహారాలు లాభించవు.




గ్రహానుకూలతల వల్ల తలచిన పనులు వేగంగా పూర్తవుతాయి. నూతన కార్యక్రమాలపై శ్రద్ధ కలిగివుంటారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారి ఆర్థికస్థితి మెరుగ్గా వుంటుంది. తోటివారితోగల మనస్పర్థలు తగ్గుతాయి. విద్యార్థులకు విద్యపై శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులకు పంటలపై గిట్టుబాటు ధరలుంటాయి. కళా, క్రీడా రంగాల వారికి మానసిక ప్రశాంతత, అనుకూల వార్తాశ్రవణం వుంటుంది.




పనులలో విజయం, ఆర్థికాదాయం, గౌరవాగౌరవములు పొందగలరు. వృత్తి, వ్యాపారాలలోనివారు క్రయవిక్రయాలలో సాహస కార్యాలకు దూరంగా వుండాలి. ప్రతి పనిలో శ్రమవున్నా ప్రయోజనాన్ని చూడగలరు. విద్యార్థులకు తమ వ్యవహారాలలో మెళకువ అవసరం. నూతన మిత్రులేర్పడగలరు. వ్యవసాయదారులకు శ్రమకు తగ్గ ఆదాయం వుంటుంది.

# రాశుల్లో 'సూర్యుడి'ప్రవేశం 'స్థిరీకర ఘడియ పుణ్యకాలాలు!'

*వి.ప్రణవిరాజు నెల్లూరు*

* *సూర్యుడు ఆయా రాశుల ప్రవేశాల్లో పుణ్య ఘడియలు వుంటాయంటారు నిజమేనా?*

మీరు విన్నది నిజమే! సూర్య సిద్ధాంతం ప్రకారం సూర్యుడు మేషరాశి ప్రవేశం 'విషువం' అంటారు. పది పూర్వ ఘడియలు పుణ్యకాలమని శాస్త్ర సిద్ధాంతం.

*దశరథ్ వై తిరుపతి-3*

* *అదృష్టమా, కష్టామా ఏది కరెక్టు?*

ఎవరి పని వాళ్ల ప్రణాళికా బద్ధంగా చేయాలి. అలాంటి వారికే అదృష్టం కూడా కలిసి వస్తుంది. 'గీత' అదే చెబుతూంది.

*డా॥రంజన్ న్యూఢిల్లీ*

* *తిరుమలలో వకుళమాలాదేవి ఆలయం అవసరమా?*

తిరుమల సువిశాల ప్రాంతంలో వకుళమాల, వెంగమాంబ, అన్నమయ్య తదితర ముఖ్య భక్తుల ఆలయాలు నిర్మాణం వల్ల మంచే జరుగుతుంది. ఆగమశాస్త్ర దోషాలు కూడా పరిహరింపబడుతాయి.

*ఉమాదేవి యం. కర్నూల్ -4*

* *యంత్ర ప్రతిష్ట తర్వాత ముఖ్యమైన సమస్యలు తొలగిపోయాయి?*

యంత్రం బీజాక్షర సమన్వితం, అత్యధిక శక్తివంతమైనది. అందువల్లే ప్రతిష్ట తర్వాత సమస్యలు పరిష్కరింపబడుతాయి. అయితే మీ నమ్మకం కూడా అంతకంటే ఎక్కువ పని చేసింది.

*ఎన్.వెంకటేశ్వరరావు నాయుడుపేట*

* *మానసిక పరిస్థితి బాగోలేదు. ప్లాను పంపిస్తున్నాను.*

వాయువ్యం అగాధమైన సెప్టిక్ ట్యాంక్‌ను వెంటనే తొలగించండి. ఒత్తిడులు తగ్గుతాయి.

*మునీర్‌బాషా షేక్ నెల్లూరు*

* *తిరుమలలో 'వరాహస్వామి'కి వాస్తు ప్రశస్తి లేదా?*

దేశ వ్యాప్తంగా జరుగుతున్న ఆలయ విధ్వంసాల నేపథ్యంలో జ్ఞానులు వరాహ ప్రతిష్ట చేసి తిరుమలను కాపాడారు. దర్శనం 'క్యూ'ని వరాహ ఆలయం మీదుగా ఏర్పాటు చేసి కట్టడి చేస్తే వరాహ దర్శనం తప్పనిసరి అవుతుంది.

*డి.తిరుపతిరావు హైదరాబాదు*

* *'పాప నాశనం' భౌగోళిక పరిస్థితుల భవిష్యత్తు ఎలా వుంటుంది?*

సహజ సిద్ధమైన పూర్వపు పాపనాశనం ప్రకృతి అందాలు గొప్పవి. ప్రస్తుతం కృత్రిమత్వం వల్లా భవిష్యత్తులో యాత్రికుల సందడి గణనీయంగా తగ్గిపోతుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డి.ఉదయభాస్కర్ సూళ్లూరుపేట*

* *ఈశాన్యం పెరగవచ్చా? తక్కిన దిక్కుల పరిస్థితి ఏమిటి?*

స్థలరీత్యా ఈశాన్యం ఆరు అంగుళాల వరకు పెరగవచ్చు. మరే దిక్కు పెరిగినా మరో దిక్కు లోపభూయిష్టమవుతుంది. దుష్ఫలితాలేర్పడతాయి.

*ఇ.మునిరెడ్డి చిత్తూరు*

* *జ్యోతిషం ఎన్ని భాగాలు? వాటిని గురించి చెప్పండి?*

సిద్ధాంత, జాతక, సంహితలని జ్యోతిషం మూడు భాగాలు. వీటినే స్కంధాలని కూడా అంటారు.

*ప్రయాగశాస్త్రి వి జొన్నవాడ*

* *'సర్పదోషం' ఎట్లా ఏర్పడుతుంది?*

పంచమ భావదోషాల్ని శాస్త్రం సర్పదోషమంటున్నది. అయితే సప్తర్షుల ప్రకారం ద్వాదశభావ దోషాలు సర్పదోషమవుతున్నవి. ఉదా: పంచమ సంతానస్థానంలో రాహువు కుజుడి చూపుకు గురికావడాన్ని సర్పదోషమంటారు. ఇలాంటి పన్నెండు దోషాలు కూడా సర్పదోషాల క్రిందే లెక్క

*కె.అలివేలు ఆత్మకూరు*

* *ఆగ్నేయం వంటగది వీలుగాకపోతే వంట ఎక్కడ చేయాలి?*

దక్షిణ గృహానికి ఉచ్చం, ప్రవేశం ఆగ్నేయం గనుక ప్రత్యామ్నాయ వంటగదిని వాయువ్యపు గదిలో ఏర్పాటు చేసుకోవచ్చు.

# త్రాగునీటి ప్రాజెక్టులు పూర్తయ్యేదెన్నడు?

**గ్రామీణ నీటి సరఫరా విభాగం యాజమాన్యాన జిల్లాలో చేపడుతున్న త్రాగునీటి సరఫరా ప్రాజెక్టుల పనులన్నీ అసంపూర్తిగా ఉన్నాయి. దీని వల్ల వందలాది గ్రామాల్లో ప్రజలు త్రాగునీటికి ఇబ్బందులు పడక తప్పడం లేదు.**

జిల్లాలో గ్రామీణ నీటి సరఫరా విభాగం ఆధ్వర్యంలో చేపట్టిన త్రాగునీటి ప్రాజెక్టుల నిర్మాణ పనులు అసంపూర్తిగా వున్నాయి. నిర్ణీత సమయం లోపల పనులు పూర్తి చేయకపోవడంతో త్రాగునీటి కోసం ప్రజలు ఇబ్బంది పడకతప్పడం లేదు. అధికారులు నిర్వహిస్తున్న ప్రతి సమీక్షా సమావేశంలో త్రాగునీటి ప్రాజెక్టు పనులు త్వరితగతిన పూర్తి చేయాలని ఆదేశిస్తున్నారు. అయితే పనులు దక్కించుకున్న కాంట్రాక్టర్ల చేత పనులు పూర్తి చేయించేందుకు సంబంధితశాఖ అధికారులు కృషి చేయడం లేదు. త్రాగునీటి కోసం ప్రజలు అనేక ఇబ్బందులు పడుతున్నా తామకెటువంటి సంబంధం లేదన్న విధంగా అధికారులు వ్యవహరిస్తున్నారు.

గ్రామీణ నీటిసరఫరా విభాగం ఆధ్వర్యంలో వివిధ పేర్లతో త్రాగునీటి పథకాలు మంజూరు చేసింది ప్రభుత్వం. అంబేద్కర్ జీవనధార, సమగ్ర రక్షిత మంచినీటి పథకం, సుజలాం-సుఫలాం, జల మణి, క్షామ నివారణ పథకం, కరువు సహాయక నిధులు, సంపూర్ణ పారిశుధ్య పథకాలు అమలవుతున్నాయి. జిల్లాలోని 46మండలాలు, 961 గ్రామ పంచాయితీలు 3,012 నివాసిత ప్రాంతాలకు త్రాగునీటి అవసరాలు తీర్చాల్సి వుంది. 2,696 రక్షిత మంచినీటి పథకాలు, 29 సమగ్ర రక్షిత మంచినీటి పథకాలు, 16,871 చేతి పంపులు ఏర్పాటుచేసినట్లు అధికారులు చెబుతున్నారు. ఇవే కాకుండా 12వ ఆర్థిక సంఘం నిధులు, 13వ ఆర్థికసంఘం నిధులు దాదాపు 2 కోట్ల రూపాయలు మంజూరయ్యాయి.

జిల్లాలో 2009-2010 ఆర్థిక సంవత్సరంలో చేపట్టిన పనులు నేటికి పూర్తి కాలేదు. గ్రామీణ నీటి సరఫరా విభాగం ఇంజనీర్ ఇన్ ఛీఫ్ ఆదేశాల మేరకు 46 మండలాల్లో నీటిని శుద్ధి చేసే యంత్రాలను ఏర్పాటు చేసి వెయ్యి లీటర్ల నుంచి రెండువేల లీటర్ల పరిణామం గల మంచినీటిని సరఫరా చేయాల్సి వుంటుంది. ఈ ఆదేశాలు వెలువడి రెండు సంవత్సరాలు కావస్తున్నా నీటిని శుద్ధిచేసే యంత్రాన్ని బిగించలేకపోతున్నారు. జలమణి పథకం క్రింద మొదటి విడతగా త్రాగునీటి వనరులున్న 157 పాఠశాలల్లో కూడా నీటి శుద్ధిప్లాంట్లు ఏర్పాటు చేస్తామని గతంలో అధికారులు ప్రకటించి వున్నారు. వందకుపైగా పాఠశాలల్లో వీటిని ఏర్పాటు చేశామని చెబుతున్న వారు ఏ పాఠశాలలో బిగించారన్న వివరాలు వెల్లడించడం లేదు.

సంపూర్ణ పారిశుధ్య పథకం ద్వారా మరుగుదొడ్లు నిర్మించాల్సి వుంది. అయితే ఈ పథకం గురించి గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలకు సరైన అవగాహన కల్పించే వారు కరువయ్యారు. ఈ పథకం అమలు కోసం కోట్ల రూపాయల నిధులు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రతి సంవత్సరం విడుదల చేస్తున్నాయి. ప్రభుత్వాలు విడుదల చేస్తున్న నిధులు సకాలంలో ఖర్చు చేస్తే త్రాగునీటి ఎద్దడి ఏర్పడే అవకాశం వుండదు. అలా కాకుండా త్రాగునీటి ప్రాజెక్టుల పనులను కాంట్రాక్టర్లకు అప్పగించి, అనంతరం వీటిని పట్టించుకోకపోతుండడం వలన సంవత్సరాల తరబడి పూర్తి కాకుండా పోతున్నాయి. ప్రస్తుతం జిల్లాలో వర్షాలు ఆశించిన మేర కురవకపోవడంతో కొంత మేర భూగర్భ జలాలు అడుగంటాయి. విద్యుత్ కోతల నేపథ్యంలో త్రాగునీటి సరఫరా సక్రమంగా జరగడం లేదు.

వారంలో రెండు రోజులు మాత్రమే త్రాగునీటి సరఫరా అవుతున్న గ్రామాలు అనేకం వున్నాయి. త్రాగునీటి పథకాల పనులు పూర్తయిన అనంతరం సంబంధిత గ్రామ పంచాయితీలు వీటిని నిర్వహించాల్సి వుంటుంది. పైపుల లీకేజి, మోటార్ల మరమ్మత్తులకు గురైన సమయంలో పంచాయితీ కార్యదర్శులు పట్టించుకోవడం లేదు. మరమ్మత్తులు చేయించేందుకు నిధులు కొరత సాకుగా చూపి తప్పించుకుంటున్నారు. దీంతో వాటర్ క్యాన్లను కొనుగోలు చేసి దాహార్తి తీర్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇప్పటికైనా అధికారులు స్పందించి అసంపూర్తిగా వున్న త్రాగునీటి ప్రాజెక్టుల పనులను పూర్తి చేసేందుకు కృషి చేయాల్సిన అవసరం వుంది.



ఖైదీల జల్సా

# మద్యం మత్తులో ఖైదీలు - మామూళ్ల మత్తులో పోలీసులు!

**ఖైదీలకు ఎస్కార్ట్‌గా వెళ్తున్న పోలీసులు లంచాలకు కక్కుర్తి పడుతుండడంతో ఖైదీలు ఆడిందే ఆట, పాడిందే పాటవుతుంది. అడిగినంత ముట్టజెప్తే ఖైదీలకు దూరంగా ఉంచాల్సిన ప్రతి సౌకర్యం అందుబాటులోకి వచ్చేస్తుండడంతో ఖైదీలకు ఇంటికంటే జైలే పదిలంగా మారింది.**

జిల్లా జైలు నుంచి కేసుల విచారణ వాయిదాల నిమిత్తం కోర్టుకు రిమాండ్ ఖైదీలను తీసుకెళుతున్న ఎస్కార్ట్ పోలీసులు మామూళ్లు స్వీకరిస్తుంటారు. ఖైదీల స్థాయిని బట్టి పోలీసులు సదుపాయాలు కల్పించేందుకు అవకాశం కల్పిస్తుంటారు. జిల్లా జైలుకు ప్రతిరోజు పోలీసు కార్యాలయం నుంచి ఖైదీలను కోర్టుకు తీసుకెళ్లేందుకు ఎస్కార్టుగా పోలీసులను పంపుతారు. కనీసం ఇద్దరు పోలీసులను ఒక్కో ఖైదీకి కేటాయిస్తుంటారు. ఒకే కోర్టుకు ఎక్కువ మంది ఖైదీలను తీసుకు వెళ్లాల్సి వస్తే మరికొంత అదనపు పోలీసులను పంపుతారు. ఆర్థిక స్థోమత కలిగిన ఖైదీలకు ముందుగానే వారి బంధువులు జైలు బయట వాహనాన్ని ఏర్పాటు చేసి వుంచుతారు.

పోలీసులతో జైలు వద్దనే బేరసారాలు కుదుర్చుకున్న అనంతరం ఖైదీలను వాహనంలో ఎక్కిస్తుంటారు. జిల్లా కోర్టు, కలెక్టరేట్ ప్రాంగణంలో వున్న కోర్టుకు వెళ్లే సమయంలో ఇద్దరు ఖైదీల వెంట ఒక పోలీసు మాత్రం వాహనంలో ఎక్కి వెళుతుంటారు. ఖైదీ బంధువులు ఏర్పాటు చేసిన వాహనంలో మిగిలిన ఎస్కార్ట్ పోలీసులు కూర్చొనేందుకు అవకాశం లేకపోవడంతో కోర్టు వరకు నడిచి వెళ్లక తప్పడం లేదు. ఉదయం 9.30గంటలకు కోర్టుకు తీసుకెళ్లితే అన్ని పనులు ముగించుకొని సాయంత్రం 6గంటలకు తిరిగి జైలుకు తీసుకు వస్తుంటారు. కోర్టులో తొందరగా వాయిదా వేసినా కూడా ఆలస్యం జరిగిందన్న కారణం చూపుతుంటారు. ఎస్కార్టుగా వెళ్లిన పోలీసులకు అధిక మొత్తంలో మామూళ్లు ముట్టడంతో పాటు, విందు, అవసరమైతే మద్యం కూడా అందిస్తుంటారు.

రిమాండ్ ఖైదీలకు ఎస్కార్టుగా వెళ్లే పోలీసులు మామూళ్లు తీసుకోవడం కొత్తేమి కాదు. అనేక సంవత్సరాల నుంచి ఈ వ్యవహారం సాగుతోంది. కొన్ని సందర్భాల్లో పేరు మోసిన నేరస్తులు పోలీసుల ఉదాసీనత కారణంగా తప్పించుకుంటున్నారు. ఆ తర్వాత సంబంధిత పోలీసు స్టేషన్‌లో కేసు నమోదు కావడం, పోలీసులను సస్పెండ్ చేయడం మామూలే. ఎస్కార్టుగా వెళుతున్న పోలీసులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే వారిపై చర్యలు తీసుకొనే అధికారం జైలు అధికారులకు వుండదు. జిల్లా ఎస్పీకి ఫిర్యాదు చేస్తారు. ఆ తర్వాత చర్యలు తీసుకొనే అధికారం ఎస్పీకి వుంటుంది. గతంలో నెల్లూరు రూరల్ మండలం దొంతాలి గ్రామానికి చెందిన వ్యక్తికి హత్యా నేరం క్రింద శిక్ష పడింది. శిక్ష పడిన వ్యక్తి అనారోగ్య కారణాలతో ప్రభుత్వాస్పత్రిలో చేరాడు. అక్కడ ఎస్కార్టు పోలీసుల సహకారంతో దొంతాలికి కారులో వెళ్లాడు. గ్రామానికి వెళ్లిన సమయంలో ఇతనిపై ప్రత్యర్థులు దాడికి దిగారు.

ప్రత్యర్థులు దాడికి దిగడంతో ఎస్కార్టుగా వెళ్లిన పోలీసులు సైతం భయాందోళన చెందాల్సి వచ్చింది. ఈ విషయం బహిర్గతం కావడంతో పోలీసులను సస్పెండ్ చేశారు. గతవారంలో సంగంకు చెందిన ప్రసాద్ అనే వ్యక్తి కూడా కోర్టు వాయిదాకు వెళ్లి మద్యం సేవించి జైలుకు రావడంతో జైలు సిబ్బంది గుర్తించారు. ఈ విషయంపై ఎస్కార్టుగా వెళ్లిన పోలీసులను ప్రశ్నిస్తే తమకేమి తెలియదంటూ బుకాయించారు. పోలీసుల నిర్లక్ష్యం కారణంగా ముద్దాయి మద్యం సేవించినట్లు గుర్తించిన జైలు సూపరింటెండెంట్ ఎస్పీకి ఫిర్యాదు చేశారు. పై రెండు సంఘటనలు కేవలం ఉదాహరణ మాత్రమే. జిల్లా జైలు, ప్రభుత్వాస్పత్రికి ఎస్కార్టుగా వెళుతున్న ఎ.ఆర్ పోలీసుల్లో క్రమశిక్షణ పూర్తిగా లోపించడంతో బాధ్యతారహితంగా వ్యవహరిస్తూ నిందితులకు సహకరిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి.

వీరిపై పర్యవేక్షణ లేకపోవడం కూడా విధుల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరించేందుకు మరో కారణంగా భావించవచ్చు. ఇప్పటికైనా జిల్లా ఎస్పీ స్పందించి ఎస్కార్టుగా నియమిస్తున్న పోలీసుల పనితీరును పర్యవేక్షించి గాడిలో పెట్టాల్సిన అవసరం వుంది.





## వంద రోజుల సినిమాలు రావు!

హీరో నాగార్జున సినీ పరిశ్రమకు సంబంధించిన ఏ విషయాన్నైనా కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడేస్తారు. ఇదివరకటిలా ఒక సినిమా ఎక్కువ రోజులు ఆడడం లేదు. కారణమేమిటంటే; సమాధానంగా వందరోజుల సినిమాల్ని ఇక మనం మరచిపోవాల్సిందేనన్నారు. ఇప్పుడు ఒక సినిమా వందలాది థియేటర్లలో విడుదలవుతోంది. రెండు, మూడు వారాల్లోపు వసూళ్లను రాబడుతోంది. గతంలోలా కాకుండా... ఇప్పుడు మారుమూల గ్రామానికి కూడా కొత్త సినిమాలు వెళ్తున్నాయి. ఎప్పటికప్పుడు చూసేస్తున్నారు ప్రేక్షకులు. ఇక యాభైరోజులు, వందరోజులు ఎలా ఆడతాయి? హైదరాబాదు సిటిలోనే ఇప్పుడు 60 నుంచి 70 థియేటర్లలో ఒక సినిమా విడుదలవుతోంది. ఇప్పటికీ వందరోజులు సినిమా ఆడిందంటే... ఎవరో పని కట్టుకొని ఆడించినట్లు అర్థం చేసుకోవాలన్నారు నాగార్జున.

## ఆనందంగా ఉన్నాను!



బెంగాలీ భామ, దశాబ్దానికి పైగా హిందీ సినిమాల్లో హీరోయిన్ బిపాసబసు తాను జాన్ అబ్రహాంతో విడిపోయాక ఒంటరిగా సంతోషంగానే ఉన్నానంటుంది. ఈ విషయమై వివరిస్తూ నేను ఒంటరిగా ఉన్నా ఆనందంగానే ఉన్నాను. నా మనసు తోడు కోరుకుంటుందా? లేదా అనే విషయమై స్పష్టమైన అవగాహనకు రాలేకపోతున్నాను. దానికి కారణం లేకపోలేదు. ఇంతకు ముందులా నాపై నాకు నమ్మకం కుదరడం లేదు. అయినా సంతోషంగానే గడచిపోతుంది. అయితే నా చుట్టూ నాకే తెలియని ఏదో చిన్న గందరగోళం ఉందని బిపాస ఒప్పుకొంది.



## ముని మూడో భాగం!

హారర్ చిత్రంలో హాస్యరసాన్ని కలిపిన దర్శకుడు లారెన్స్. ఆయన కథానాయకుడిగా నటిస్తూ దర్శకత్వం వహించిన చిత్రం ముని. ఈ సినిమా ప్రేక్షకులను భయభ్రాంతున్ని చేసిన దానికంటే ఎక్కువగా నవ్వించింది. దీనికి కొనసాగింపుగా కాంచన తీశారు. ఇందులో లారెన్స్ నటనతో పాటు శరత్‌కుమార్ పాత్ర ప్రేక్షకుల్ని ఉత్కంఠ పరిచింది. ఇప్పుడు ముని–3 చిత్రానికి లారెన్స్ రంగం సిద్ధం చేసుకొంటున్నాడని తెలిసింది. దీనికంటే ముందు కాంచన త్రీడీకి సంబంధించిన పనులపై లారెన్స్ దృష్టి పెడుతున్నాడు. అలాగే కాంచనను హిందీలోకి తీసుకెళ్లే ఆలోచన చేస్తున్నాడు. ఇక్కడ శరత్‌కుమార్ చేసిన పాత్రను సంజయ్‌దత్‌కు చెప్పారని తెలిసింది.

## మహేష్ సరసన కృతి!



మహేష్‌బాబు, కాజల్ జంటగా బిజినెస్‌మేన్ చిత్రంలో నటించారు. ఈ జోడీ మాస్‌కి నచ్చింది. ఈ జంటతోనే సుకుమార్ కొత్త చిత్రానికి శ్రీకారం చుట్టారు. కాస్త చిత్రీకరణ తర్వాత కాజల్‌ని తప్పించారు. ఆమె స్థానంలో తమన్నా వస్తుందన్నారు. అన్నింటికి తెరపడింది. మహేష్‌తో నటించే భామ ఖరారైంది. ఆమె పేరు కృతి సనోన్. ముంబైకి చెందిన కృతి మాడలింగ్ రంగం నుంచి నటన వైపు అడుగులు వేస్తోంది. ఇంజనీరింగ్ చదివిన ఆమె పలు సంస్థలకు మోడల్‌గా పని చేసింది. ఫ్యాషన్ షోల్లో ర్యాంప్‌పై నడిచింది. కథక్ నృత్యంలో శిక్షణ పొందింది. ఇప్పుడు మహేష్ సరసన నటించే ఛాన్స్ దక్కించుకొంది. మహేష్‌బాబు కాలేజ్ లెక్చరర్‌గా కనిపించే ఈ చిత్రానికి దేవిశ్రీప్రసాద్ స్వరాలు సమకూరుస్తున్నాడు. మహేష్‌తో ఆయన చేసే తొలి చిత్రం కావడంతో ఎక్కువ శ్రద్ధతో పని చేస్తున్నాడట.



## నచ్చితే నటిస్తా!

అందాలతార శ్రీదేవి నటించిన ఇంగ్లిష్ వింగ్లిష్ ప్రేక్షకాదరణ పొందడం పట్ల ఆమె ఆనందాన్ని వ్యక్తం చేసింది. ఈ విషయమై మాట్లాడుతూ చాలా రోజుల తర్వాత ప్రేక్షకుల ముందుకు వచ్చినా ఆదరించారు. ఈ స్ఫూర్తితో ఇక నుంచి నా మనసుకు నచ్చిన పాత్రలు వస్తే నటిస్తాను. గతంలో శ్రీదేవి నటించి ఘనవిజయం సాధించిన మిస్టర్ ఇండియా, హిమ్మత్‌వాలా చిత్రాలను రీమేక్ చేస్తున్న విషయమై అడగ్గా ఈ సినిమాలు విడుదలైన తరువాతే కాదా? వాటిలో ఏముందో తెలుస్తుంది. ఇప్పుడే వాటి గూర్చి మాట్లాడి లేనిపోని వార్తల్లో ఉండడం తనకు ఇష్టం లేదని చెప్పిందావిడ.




అల్లూరు రహీం

గబ్బర్‌సింగ్ చిత్ర విజయం తర్వాత హీరో పవన్‌కళ్యాణ్ ఒప్పుకొన్న చిత్రం యూనివర్సల్ మీడియా పతాకంపై డివివి దానయ్య నిర్మించిన కెమెరామెన్ గంగతో రాంబాబు. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం అన్నీ పూరీజగన్నాధ్‌నే. ఆయనకు ఇది 25వ చిత్రం. పవన్‌కళ్యాణ్, పూరీ జగన్నాధ్‌కు దర్శకునిగా తొలి అవకాశమిచ్చిన హీరో. చాలా గ్యాప్ తర్వాత వీరిద్దరి కాంబినేషన్‌లో తయారైన ఈ చిత్రంపై ప్రేక్షకులకు ఎన్నో ఆశలుండాయి. కాని ఆ ఆశలను పూరీ జగన్నాధ్ ఈ చిత్రంతో ఒమ్ము చేశాడనే చెప్పాలి. నాలుగేళ్ల క్రితం దర్శకుడు వ్రాసుకొన్న ఈ కథలో మాజీ ముఖ్యమంత్రులు వైఎస్ రాజశేఖర్ రెడ్డి, నారా చంద్రబాబునాయుడు, టిఆర్ఎస్ నేత చంద్రశేఖర్‌రావు, సమకాలీన విస్ఫోటనం ఎలక్ట్రానిక్ మీడియా అధినేతలంతా వున్నారు.

ఎలక్ట్రానిక్ మీడియా రావడంతో లాడులస్కు కట్ట అంతా జర్నలిస్టులు లేదా కెమెరామెన్లు అయిపోయారు. ఈ బాపతే ఈ సినిమా హీరో రాంబాబు. ఆయన ఒక మెకానిక్. జనాన్ని ఏలే రాజకీయ నాయకులు చదువుకోనప్పుడు జర్నలిస్టులకు చదువెందుకంటాడు హీరో? ప్రేక్షకులు దీనికి చప్పట్లు కొడతారు. చదువులేని నాయకుడు, జర్నలిస్ట్ సమాజానికి పనికిరాడు. ఈ విషయం పూర్వాశ్రమంలో భాగ్యనగరంలో చౌదరి మెస్‌లో పనిచేసిన పూరీ జగన్నాధ్‌కు ఎలా తెలుస్తుంది? ఆయన అబ్బూరి రవి వంటి బినామి రచయితలను పెట్టుకొని తానే డైలాగులు వ్రాసినట్లు వెండి తెరపై తన పేరు వేసుకొని నంది అవార్డు తీసుకొంటే మనం జై కొట్టాలా?? స్పీడుగా కథ వ్రాయడంతో పాటు సినిమాను తీసే అలవాటున్న పూరీ జగన్నాధ్ మదిలో మెదిలిన 'మీడియా' పాయింట్ చుట్టూ అల్లిన కెమెరామెన్ గంగతో రాంబాబు సినిమా కొన్నిసార్లు స్పీడ్‌గా పరుగెడుతుంది. షడన్ బ్రేక్‌తో ఆగుతుంది. మరికొన్నిసార్లు సామాన్య ప్రేక్షకులకు నీరసం వచ్చేలా నడుస్తుంది. అయితే ఈ చిత్రంలో ఎలక్ట్రానిక్ మీడియాలోని లొసుగులు, ఆ మీడియా జనంలోకి ఎంత స్పీడ్‌గా చొచ్చుకు వెళ్తుందో చెప్పిన తీరు మాత్రం బాగుంది. అయితే న్యూస్ హెడ్‌లుగా అలీ, బ్రహ్మానందం లాంటి బఫూన్‌గాళ్లతో మీడియా నడవదని పూరీ జగన్నాధ్‌కు తెలియనట్లుంది. తెలంగాణ సమస్యను తెలుగు తల్లి పేరుతో చెప్పేయత్నం చేయడం ఆంధ్రా వాళ్లకు నచ్చుతుందికాని, తెలంగాణ వారికి బాగా కోపం తెప్పిస్తుంది. ఈ సినిమాలో రాజకీయ నాయకుల చేత జనాన్ని తెలివిగా దర్శకుడు తిట్టిస్తాడు. ఇన్ని జాతులు, కులాలు, మతాలున్నాయి కాబట్టి రాజకీయ నాయకులు బతికేస్తున్నారని వారిపై సైతం వ్యంగ్యాస్త్రాలు సంధిస్తాడు. ప్రపంచంలో అమ్మాయిలంతా ఆర్డినరీలంటూ ఆడవాళ్లను తిడతాడు. మగ పురాణాలంటూ ఒక స్త్రీ పాత్ర చేత పురాణాలు వ్రాసిన వాళ్ల తలంటుతాడు. లీడర్లు గుర్తుంటారు... జర్నలిస్టులుండరు. మీడియానా... తొక్కా అంటూ మీడియాను తిట్టాడు. ఉంచుకోవడానికి ఉయ్యాల ఊపుకోవడానికి మీడియా ఉంపుడుకత్తె కాదనే డైలాగు ఈ రోజుల్లో వాస్తవం కాదు. దరిదాపులు మీడియాలన్నీ ఉంపుడుకత్తెలే. మణిశర్మ సంగీతం కూర్చిన ఐదు పాటల్లో నీ నగుమోము చరణంతో సాగే పాట బాగుంది. చివరన లక్షలాది మంది జనంతో హీరో నిలబడే సన్నివేశం గ్రాఫిక్స్‌తో సృష్టించిన తీరు బాగుంది.




చిత్రకథలోనికి వెళ్తే ప్రతిరోజు టివీ, పత్రికలు చూసి, చదివి బాగా స్పందించే మెకానిక్ రాంబాబు(పవన్‌కళ్యాణ్), ఎన్‌సి న్యూస్ ఛానల్ కెమెరామెన్ గంగ(తమన్నా) సహకారంతో రిపోర్టర్ అవుతాడు. సూటిగా ప్రశ్నల వర్షం కురిపించే ఆయన వల్ల మాజీ ముఖ్యమంత్రి జవహర్‌నాయుడు(కోట శ్రీనివాసరావు) ఆయన కుమారుడు రానా నాయుడు(ప్రకాష్‌రాజ్) ఎన్నో ఇబ్బందులు పడతారు. రాంబాబును మట్టు పెట్టే ప్రయత్నం చేస్తారు. ఈ సంఘటన తర్వాత రాంబాబు రాష్ట్ర ప్రజలందరినీ హైదరాబాద్ రమ్మని పిలుపిచ్చి మొత్తం రాష్ట్ర రాజకీయాన్ని మార్చడంతో సినిమా ముగుస్తుంది. ఈ చిత్రంలో పవన్‌కళ్యాణ్, తమన్నాలతోపాటు కోట శ్రీనివాసరావు తమ పాత్రలను అద్భుతంగా పోషించారు.

ఈ చిత్రాన్ని నిర్మాతలు విప్లవ చిత్రాల కథానాయకుడు ఆర్.నారాయణమూర్తికి అంకితమివ్వడం విశేషంగా చెప్పుకోవాలి.

# వి.ఎస్.యూనివర్శిటీలో అన్నీ అక్రమాలే!

**● ప్రారంభంలోనే పరువు పెన్నా పాలు**

కొత్తగా ఏర్పాటైన విక్రమ సింహపురి యూనివర్శిటీ బాలారిష్టాలను దాటకముందే పైరవీలు, నిధులు ప్రక్కదారి పట్టడంలాంటి కారణాలతో గబ్బు పట్టిపోతోంది. అర్హులకు కాకుండా రాజకీయ సిఫార్సులకు పెద్ద పీట వేస్తూ ఉద్యోగాల నియామకం జరుగుతుండడంతో అడ్డదారిన ఉద్యోగాలు పొందే వారి సంఖ్య అధికమవుతోంది. మరోవైపు డిగ్రీ, పిజి విద్యార్థులకు బోధన చేసేందుకు నిబంధనల ప్రకారం ఉండాల్సిన అర్హతలున్న వారు కాకుండా రాజకీయ పలుకుబడి కలిగి ఉండడమే ప్రధాన అర్హత కావడంతో ఉన్నత విద్యార్హతలేని వారు అధ్యాపకులుగా కొనసాగుతున్నారనే ఆరోపణలు వస్తున్నాయి. జిల్లావాసులు చాలా ఏళ్లుగా ఎదురుచూస్తున్న యూనివర్శిటీ కల 2008 – 09 సంవత్సరంలో సాకారమైంది. విక్రమ సింహపురి యూనివర్శిటీ పేరుతో జిల్లాకు కొత్త యూనివర్శిటీ ఏర్పాటైంది. విద్యావకాశాలు మెరుగు పడడంతోపాటు ఉద్యోగ అవకాశాలు లభిస్తాయని ఎదురుచూసిన నిరుద్యోగులకు యూనివర్శిటీలో కీలక స్థానాల్లో ఉన్న కొందరి తీరు వలన యూనివర్శిటీ భ్రష్టుపట్టి పోతోంది. యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్(యుజిసి) అనుమతి లభించని ఈ యూనివర్శిటీ పరిధిలో జిల్లాలోని 120 డిగ్రీ కళాశాలలు, పిజి కాలేజీలు ఉన్నాయి. చెరువు వద్ద తాత్కాలికంగా యూనివర్శిటీ కార్యాలయం ఉండగా, తరగతులను విఆర్ కళాశాలలో నిర్వహిస్తున్నారు. ఇందులో కొత్తగా 12 కోర్సులను ఏర్పాటు చేశారు. ప్రతి డిపార్టుమెంటులో రీడర్‌తోపాటు, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్, ప్రొఫెసర్, అసిస్టెంట్ ప్రొఫెసర్ పోస్టులుండాలి. వీటికి ఎంఫిల్, పిహెచ్‌డి అర్హతగల వారిని నియమించాలి. కానీ ప్రస్తుతం రీడర్ లేదు, హెచ్ఓడిలు లేరు. ప్రొఫెసర్లు ఒకరిద్దరున్నా మిగిలిన వారు అసిస్టెంట్ ప్రొఫెసర్లే. ఉద్యోగ నియామకాల విషయానికొస్తే యూనివర్శిటీలో అన్నీతానై వ్యవహరించే కీలక స్థానంలో ఉన్న వ్యక్తి జిల్లాకు చెందిన ప్రజాప్రతినిధి చెప్పిన వారినే ఉద్యోగాల్లో చేర్చుకొంటున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. 70 మంది నాన్ టీచింగ్ స్టాఫ్‌ను నియమిస్తే వీరిలో అధిక భాగం విఆర్ కళాశాలకు చెందిన వారే ఉన్నారట. అలాగే విఆర్‌సిలో రిటైర్ అయిన పలువురికి యూనివర్శిటీలో ఉద్యోగాలిచ్చి ఉన్నారట. అధ్యాపకుల పోస్టులలోనూ విఆర్ కళాశాలలో పనిచేస్తున్న వారిని కాంట్రాక్ట్ అధ్యాపకులుగా తీసుకొని ఉన్నారని, దీనికి నేతల సిఫార్సులే కారణంగా తెలుస్తోంది. అలాగే ప్రభుత్వం నుంచి వచ్చే నిధులు, వివిధ కళాశాలల నుంచి యూనివర్శిటీకి ఫీజుల రూపంలో అందే మొత్తాలు ప్రక్కదారి పడుతున్నాయని గగ్గోలు రేగుతోంది. సరిగా ఆడిట్ జరగకపోవడం, ఆజమాయిషీ లేకపోవడం, వ్యక్తిగత కారణాలతో రాజకీయ సిఫార్సులకు పెద్దపీట వేస్తుండడంతో విక్రమ సింహపురి యూనివర్శిటీ ఉద్యోగ నియామకాలు గాడి తప్పుతున్నాయి.


అవకతవకల పాలన.

# గ్యాస్ సిలిండర్లు తూకమేసి తీసుకోండి!

**● గ్యాస్ సరఫరా కంపెనీల సలహా!**

ఇక నుంచి ఇంటి వద్దనే గ్యాస్ సిలిండర్లను తూకంవేసి వినియోగదారులకు అందించాల్సి ఉంటుంది. గ్యాస్ గోడౌన్ల నుంచి సిలిండర్లను తీసుకు వస్తున్న ఏజెన్సీల సిబ్బంది అక్రమాలకు పాల్పడుతూ గ్యాస్ ఫిల్లింగ్ చేస్తున్నారు. దీనిపై వినియోగదారులు ఫిర్యాదులు చేశారు. గ్యాస్ ఏజెన్సీలు పాల్పడుతున్న అక్రమాలను నియంత్రించేందుకు వినియోగదారులకు ఇంటి వద్దనే తూకం వేసి అందించాలని అధికారులు నిర్ణయించారు. ఇటీవల సుప్రీం కోర్టు కూడా గ్యాస్ సరఫరాపై ఆదేశాలు జారీ చేస్తూ తప్పనిసరిగా గ్యాస్ సిలిండర్లను తూకంవేసి అందించాలని తేల్చి చెప్పింది. దీంతో ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ అధికారులు నగరంలో గ్యాస్ ఏజెన్సీల నిర్వాహకులతో సమావేశం ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా ఇక నుంచి వినియోగదారులకు అందించే గ్యాస్ సిలిండర్ల సరఫరాలో అక్రమాలకు పాల్పడితే కఠిన చర్యలు తీసుకుంటామని హెచ్చరించడం జరిగింది. వినియోగదారులు కూడా గ్యాస్ సిలిండర్ వచ్చినప్పుడు తూకంవేసి సరిచూసుకున్న అనంతరం తీసుకోవాలని కోరారు. అయితే ఈ విధానం ఎంతవరకు అమలవుతుందో చూడాలి.


కొత్త ఉత్తర్వు అమలయ్యేనా?


షోరూంను ప్రారంభిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి.

## లక్ష్మీప్రసన్న హోండా షోరూం ప్రారంభం

నెల్లూరు మినీ బైపాసు రోడ్డులో హోటల్ శ్రావణ్య ఎదురుగా హోండా కంపెనీ వారి లక్ష్మీ ప్రసన్న హోండా షోరూంను 18వ తేదీ నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ దినదినాభివృద్ధి చెందుతున్న నెల్లూరులో అత్యాధునిక పరిజ్ఞానంతో తయారైన హోండా బైకులు అమ్మకాలు జోరుగా ఉంటున్నాయి. ఈ కంపెనీలో అన్ని మాడళ్లను అందుబాటులో ఉంచిన షోరూం నిర్వాహకులను అభినందిస్తున్నానన్నారు. షోరూం అధినేత యు.రామకృష్ణ మాట్లాడుతూ హోండా బైకులు యువతను ఆకట్టుకొంటున్నాయని, దీనికితోడు ఆధునిక సాంకేతిక హంగులతో బైకుల సర్వీసు సెంటర్‌ను అందుబాటులో ఉంచామన్నారు. ఈ కార్యక్రమంలో నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, హోండా కంపెనీ ప్రతినిధులు పాల్గొన్నారు.

# నెల్లూరులో బ్లాక్ టిక్కెట్ల దందా!


కొత్త సినిమా వస్తే చాలు లీలామహల్ వద్ద బ్లాక్ టిక్కెట్ల సందడే సందడి.

నగర వాసులకు మానసిక ఉల్లాసాన్ని కల్గించే ఏకైక సాధనం సినిమా. దీనిని చూడడం ద్వారా నిత్యజీవితంలో ఎదురయ్యే ఒత్తిడులు, సమస్యల నుంచి రెండు గంటలపాటు ఉపశమనం పొందుతారు. అలాంటి సినిమా చూడాలంటే బ్లాక్‌లో టిక్కెట్లు కొని చూడాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. పెద్ద హీరోలు, క్రేజ్ ఉన్న హీరోల సినిమాలు విడుదలైనపుడు వివిధ థియేటర్లలో బ్లాక్ టిక్కెట్లు విచ్చలవిడిగా అమ్ముతున్నారు. ఒక్కో టిక్కెట్ ఆరు వందల నుంచి ఎనిమిది వందల రూపాయల వరకు అమ్ముడవుతుంది. పవన్ కళ్యాణ్ హీరోగా నటించిన కెమెరామెన్ గంగతో రాంబాబు సినిమా టిక్కెట్లను ఈ విధంగానే అధిక ధరలకు బ్లాక్‌లో విక్రయించడంతో సగటు ప్రేక్షకులు సినిమా చూసే అవకాశాన్ని కోల్పోతున్నారు. ఈ సినిమా అనే కాదు పెద్ద హీరోల సినిమా ఏది విడుదలైనా ఇదే పరిస్థితి. నర్తకి, లీలామహల్, రాధా–మాధవ్, అర్చన తదితర హాళ్లలో బ్లాక్ టిక్కెట్ల విక్రయాలు విచ్చలవిడిగా, బహిరంగంగానే జరుగుతున్నాయి. ఆయా సినిమా హాళ్ల మేనేజర్లే తమ మనుషుల ద్వారా అధిక ధరలకు విక్రయిస్తున్నారనే ఆరోపణలున్నాయి. లీలామహల్ వద్ద బ్లాక్ టిక్కెట్లు అమ్మేవారు గేటు ముందు నిలబడి అమ్ముతున్నా పట్టించుకునే వారే లేకుండా పోయారు. వీటికి తోడు సినిమా హాళ్లలో మద్యం సేవించడం అధికమైంది. హాళ్లలోకే మద్యం బాటిళ్లు, బీరు బాటిళ్లు తీసుకొని వచ్చి సీట్లలో కూర్చొని తాగుతూ నానా గొడవ చేస్తుండడంతో సినిమా చూసేందుకు వచ్చే కుటుంబాలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నాయి. ముఖ్యంగా లీలామహల్‌లో తాగుబోతుల ఆగడాలు శృతిమించి పోతున్నాయి.


విక్రమ సింహపురి యూనివర్శిటీ ప్రైవేట్ అన్‌ఎయిడెడ్ డిగ్రీ, పిజి కళాశాలల సంఘం నూతన అధ్యక్షునిగా ఎన్నికైన కోటంరెడ్డి ప్రతాప్‌రెడ్డిని సన్మానిస్తున్న చంద్రారెడ్డి, రామకృష్ణారెడ్డి.

## వదాన్యతకు మారుపేరు

16వ పేజీ కొరవ

దొడ్ల సుబ్బారెడ్డి. ఆయన వదాన్యత ఫలంగా నెల్లూరులో రెండు శాశ్వత చిహ్నాలు నెలకొన్నాయి.. వాటిలో మొదటిది డికెడబ్ల్యు కాలేజీ. దాని నిర్మాణం వెనుక చాలా చరిత్ర వుంది. అప్పట్లో జిల్లాలో మహిళా కళాశాల లేదు. కస్తూరిదేవి విద్యాలయం హైస్కూల్ వరకే వుండడంతో ఆడపిల్లలు అక్కడితో చదువు మానుకోవడం దొడ్ల సుబ్బారెడ్డి గారిని ఆలోచింప చేసింది. దానితో ఒక బాదుగింట్లో తానే ఒక మహిళా కళాశాల ప్రారంభించారు. అయితే ఇటువంటి సంస్థలు కుటుంబపరంగా వుంటే ఎక్కువ కాలం నడవవని గ్రహించి, ప్రభుత్వానికి అప్ప చెప్పడంతో పాటు, దానికి స్వంత భవనాన్ని నిర్మించి ఇవ్వడానికి పూనుకొన్నారు. అందుకు తగిన స్థలం నాటి కలెక్టర్ బంగళా అని భావించాడు. ఆనాటి నేత నీలం సంజీవరెడ్డి గారికి దొడ్ల సుబ్బారెడ్డి అంటే ఎనలేని అభిమానం, నమ్మకం. దానితో సుబ్బారెడ్డి గారు అడిగిన వెంటనే కలెక్టర్ బంగళాను ఇరిగేషన్ ఇఇ నివాసానికి మార్పించి, స్థలం స్వాధీనం చేయడమేకాక, కొత్త భవంతికి రూపకల్పన చేసే బాధ్యత కూడా దొడ్ల సుబ్బారెడ్డికే అప్పచెప్పాడు. ఆ నమ్మకానికి తగినట్లే చిన్నపాటి తాజమహల్ వంటి భవంతికి రూపకల్పన చేశారు. అప్పట్లో దాని నిర్మాణం ఖర్చు అంచనా 12 లక్షల రూపాయలు. అందులో సగం తానే భరించి డికెడబ్ల్యు కాలేజీ భవంతి నిర్మాణం ప్రారంభించాడు దొడ్ల సుబ్బారెడ్డి.

అదే సమయంలో, టౌన్‌కు తగిన ఆస్పత్రి లేదన్న కొరత కూడా ఆయన మనసుకు వచ్చింది. దానితో అప్పటి కలెక్టర్ ఎస్ఆర్.శంకరన్‌ను ఒప్పించి, దర్గామిట్టలో 85 ఎకరాల స్థలం సేకరించారు. ఆస్పత్రితోపాటు వైద్య కళాశాల స్థాపించాలనే ఉద్దేశంతోనే ఇంత విశాలమైన ప్రాంగణం సమకూర్చారు. డికెడబ్ల్యు కాలేజీ వలెనే ఆస్పత్రి భవంతికి కూడా రూపశిల్పి ఆయనే కావడం గమనార్హం. అందువల్లనే ఆ రెండు భవనాలూ ప్రభుత్వ నమూనాలకు భిన్నంగా, గొప్ప ఆర్కిటెక్చర్ డిజైన్‌తోపాటు యాభై ఏళ్ల తర్వాతి అవసరాలకు కూడా లోటు లేకుండా సరిపోయే రీతిలో రూపుదిద్దుకొన్నాయి.

అయితే దురదృష్టవశాత్తు ఈ రెండు భవంతుల నిర్మాణం మొదలు పెట్టే సమయానికి దొడ్ల సుబ్బారెడ్డి గారిని అనారోగ్యం ఆవహించింది. తాను ప్రాణం పోసిన సంస్థలు ఒక స్వరూపం ఏర్పరచుకోక ముందే కన్నుమూశారాయన. మామూలు పరిస్థితులలో అయితే ఆయన కన్ను మూయగానే ఆ రెండు సంస్థలు కూడా శిథిలమైపోయి వుండాలి. కానీ తన పినతండ్రి మీద వున్న మమకారం, ఆయన కోరిక నెరవేర్చాలన్న ఉదాత్త ఆశయంతో దొడ్ల శేషారెడ్డి గారు వాటి నిర్మాణం పూర్తి చేయించారు. ఆ రోజులలో ఈ రెండు సంస్థలకు దొడ్ల సుబ్బారెడ్డి కుటుంబం ఇచ్చిన విరాళం దాదాపు 15 లక్షల రూపాయలు. ఆ రోజుకి పెద్దాస్పత్రి పరిసరాలలో ఎకరం పొలం ధర వెయ్యి రూపాయలు కూడా లేదు. ఇప్పుడు ఎకరం ఇరవైకోట్ల రూపాయలైనా తక్కువే. అంత పెద్ద భవంతికి అయిన ఖర్చు కేవలం 12 లక్షల రూపాయలు మాత్రమే. ఇప్పుడదే భవనం కట్టాలంటే కనీసం వంద కోట్ల రూపాయలు కావాలి. దాన్నిబట్టి ఆనాడు సుబ్బారెడ్డి గారిచ్చిన విరాళం ఎన్ని వందల కోట్ల రూపాయలుగా వుంటుందో అంచనా వేసుకోవచ్చు.

అంత భారీ మొత్తాన్ని ప్రజా ప్రయోజనం కోసం దానం చేసే ఉదారత్వం ఎందరిలో వుంటుంది? అందుకు ఎంత గొప్ప మనసు కావాలి? ఆ మానసిక ఔన్నత్యంతో నెలకొన్న సంస్థలు కాబట్టే ఈనాటికీ అవి చెక్కుచెదరకుండా నిలిచి వున్నాయి. రెండు తరాలపాటు నెల్లూరు ప్రజానీకానికి వర్ణించరానంత గొప్ప ప్రయోజనం చేకూర్చాయి. ఇన్నాళ్లకు దొడ్ల సుబ్బారెడ్డి గారి కల నెరవేరబోతున్నది. ఆయన ఈ జిల్లా ప్రజలకు చేసిన మహోపకారానికి తగిన కృతజ్ఞత చెల్లించుకోవాలంటే, అక్కడ స్థాపించబోయే ప్రభుత్వ వైద్య కళాశాలకు ఆయన పేరే పెట్టడం సముచితం. అందుకు అభ్యంతరం చెప్పే అర్హత, అధికారం ఎవరికీ లేవు.

## జింకలా షర్మిల

మొదటి పేజీ కొరవ

తెలుగుదేశం పరిస్థితి ఇందుకు భిన్నం. తొమ్మిదేళ్లపాటు ముఖ్యమంత్రిగా మరొక తొమ్మిదేళ్లు ప్రతిపక్ష నేతగా చంద్రబాబు దాదాపు రాష్ట్రంలోని ప్రతి ప్రాంతంలో ఒకటికి పదిసార్లు కలియ తిరిగాడు. దానివల్ల ఆయన్ను చూడాలన్న ఆసక్తి సహజంగానే ప్రజలలో తక్కువగా ఉంటుంది. మరొక ప్రక్క రేపటి ఎన్నికలలో తెలుగుదేశం మళ్లీ గెలిచి అధికారంలోకి వస్తుందన్న నమ్మకం ఆ పార్టీ నేతలలోనే లేదు. వారంతా నీరసపడి ఉన్నారు. రెండు ఎన్నికలలో అధికారం లేదు కాబట్టి వారి ఆర్థిక వనరులూ అంతంత మాత్రం. దానితో వారు తమ నేత పాదయాత్ర పట్ల వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతల వలె ఉత్సాహం చూపలేక పోతున్నారు. జన సమీకరణ చేస్తే తప్ప పాదయాత్ర విజయం అనిపించుకోదు. జనాన్ని సమీకరించాలంటే లక్షలాది రూపాయలు ధారపోయాలి. అంత డబ్బు తెలుగుదేశం నేతలకు ఎక్కడ నుంచి వస్తుంది? దానితో షర్మిల పాదయాత్రతో పోలిస్తే చంద్రబాబు కాలినడక కొంత నీరసం అనిపిస్తున్నది.

పైగా షర్మిల యవ్వనంలో ఉన్న మహిళ. చంద్రబాబు ముసలితనం సమీపించిన దశలో ఉన్నాడు. ఇద్దరి మధ్య ఆ తేడా కూడా స్పష్టంగా కన్పిస్తున్నది. షర్మిల జింకపిల్ల వలె ఎగురుతూ నడుస్తుంటే, చంద్రబాబు తాబేలు వలె ప్రాకుతున్నాడు. అయితే ఆయన వయసును బట్టి చూస్తే మాత్రం చంద్రబాబు పడుతున్న కష్టం అంతా ఇంతా కాదని అర్థమౌతుంది. 62 ఏళ్ల వయస్సులో రోజుకు ఇరవై కిలోమీటర్లు నడవడం అంటే మాటలు చెప్పినంత సులువు కాదు. ఆరోగ్యం సహకరించక పోయినా, కాళ్లు బొబ్బలెక్కుతున్నా, మోకాళ్లు బిగుసుకపోతున్నా, వంట్లో నిస్సత్తువ ఆవరిస్తున్నా లెక్క చేయకుండా పాదయాత్ర కొనసాగిస్తున్న తీరు చూస్తే మాత్రం చంద్రబాబు పట్టుదల ఎంత బలీయమైనదో అర్థమౌతుంది. వేరొక రాజకీయ వేత్త ఎవరూ ఈ విషయంలో ఆయనకు సాటి రారన్నది నిజం.

చంద్రబాబులోని ఆ పట్టుదల, ఓర్పు తెలుగుదేశం కార్యకర్తలకు కొంతలో కొంత ఉపశమనం. అధికారంలోకి వచ్చినా రాకపోయినా ఒక పార్టీగా తెలుగుదేశం అస్తిత్వం నిలుస్తుందన్న నమ్మకాన్ని కార్యకర్తలలో, నాయకులలో నిలబెట్టడంలో చంద్రబాబు సఫలీకృతుడౌతున్నాడు. మాదిగ దండోరా మద్దతు, బిసి డిక్లరేషన్ తర్వాత ఆ వర్గాలలో పార్టీ పట్ల పెరిగిన సానుకూలత తెలుగుదేశం పార్టీకి జీవం పోస్తున్నాయి.

షర్మిల పాదయాత్ర సన్నివేశాన్ని టివిలో చూసే అవకాశం కల్గితే మాత్రం జగన్ మనసు విలవిలలాడి పోతుందన్నది నిజం. ఆమెను అంతగా ఆదరిస్తున్నారు జనం. జైలు గొడవ లేకుంటే ఆ జనాదరణ జగన్‌కు దక్కి ఉండాలి. ఈ పాదయాత్ర తర్వాత వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో జగన్‌తో సమానంగా షర్మిల ఒక కీలక రాజకీయ శక్తిగా ఎదుగుతుందన్నది నిజం. ఆమెను తన సోదరిగా కాక, సాటి రాజకీయ నేతగా చూడక తప్పదు జగన్‌కు. ముందు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో ఈ పరిణామం ఏ రాజకీయ మార్పులకు దారితీస్తుందో వేచి చూడాలి.

## తేల్చి చెప్పిన సిఎం!

మొదటి పేజీ కొరవ

అన్న ధోరణిలో వ్యవహరిస్తున్నారు. సెక్రటేరియట్లో ఏ మంత్రి పేషీకి వెళ్లినా ఈ వాతావరణం స్పష్టంగా కన్పిస్తున్నది. మరీ ముఖ్యంగా తెలంగాణ మంత్రులు కాంగ్రెస్‌లో తమకింక భవిష్యత్తే లేదన్న నిశ్చయానికి వచ్చేశారు. నీటిపారుదల, పంచాయితీరాజ్, హోమ్ వంటి కీలక మంత్రిత్వ శాఖలన్నీ తెలంగాణ వాదుల చేతిలోనే ఉన్నాయి. వారి పనల్లా, పైసలొచ్చే ఫైళ్లు ఏమి ఉన్నాయన్న వెతుకులాట మాత్రమే.

మరొక ప్రక్క ఈ తెలంగాణ మంత్రులు, గుత్తా సుఖేందర్‌రెడ్డి, మధుయాష్కీ వంటి ఎమ్పీలు కెసిఆర్‌తో లోపాయకారీ ఒప్పందాలు కుదుర్చుకొనే పనిలో బిజీగా ఉన్నారు. ఎన్నికల వరకు కాంగ్రెస్ లోనే ఉంటాము, ఆ సమయానికి మీ చెంత చేరు తామని ఒప్పందాలు చేసుకొంటున్నారు. కొందరు మంత్రులైతే తమ టిక్కెట్‌కు పాతిక కోట్ల రూపాయల ధర చెల్లించడానికి కెసిఆర్‌తో ఒప్పందాలు కుదుర్చుకొన్నారని వినికిడి. కెసిఆర్‌కు రేపటి ఎన్నికలలో డబ్బు అవసరం చాలా ఉంది. గత రెండు ఎన్నికలలో కాంగ్రెస్, టిడిపిలతో మైత్రి కుదుర్చుకొని, ఎన్నికల ఖర్చు వారి నెత్తిన రుద్దాడు. ఈసారి మాత్రం స్వంతంగా పోటీ చేయాలన్నది ఆయన ఆలోచన. ప్రజలలో తెలంగాణ మీద ఉన్న ఆకాంక్షను పూర్తిస్థాయిలో ఉపయోగ పెట్టుకోవాలనే మొత్తం 119 స్థానాలలో టిఆర్ఎస్ సభ్యులను నిలబెట్టాలన్నది ఆలోచన. అందుకు చాలా డబ్బు కావాలి. ఆ అవసరాన్ని తీర్చడానికి కాంగ్రెస్ మంత్రులు, ఎమ్పీలు సిద్ధపడుతున్నారు.

ఆంధ్ర ప్రాంతంలో కాంగ్రెస్‌వాదులకు ఆ అవకాశం లేదు. వారికి ఉన్న ప్రత్యామ్నాయం జగన్ పార్టీ ఒక్కటే. కానీ దాని వాకిట ముందు అప్పుడే హౌస్ ఫుల్ బోర్డ్ తగిలించి ఉంది. కాంగ్రెస్ మంత్రులు, ఎమ్మెల్యేలు తన పార్టీలోకి రావాలన్న కోరిక జగన్‌కు లేదు. ఉన్న వారితోనే తాను అధికారంలోకి రాగలనన్న నమ్మకం ఆయనది. కొత్తగా వీరిని తెచ్చుకొంటే లేనిపోని తలనొప్పులు తప్ప ప్రయోజనం లేదని, ప్రజలలో వారి మీద ఉన్న వ్యక్తిగత వ్యతిరేకత తన పార్టీ మీద ప్రభావం చూపి, వృధాగా సీట్ల సంఖ్య తగ్గిపోతుందని భావిస్తున్నాడు జగన్. పైగా కెసిఆర్ వలె ఆయనకు డబ్బు సమస్య లేదు. దాచుకొన్న దానిలో ఒక శాతం బయటకు తీసినా ఎన్నికల ఖర్చు నడిచిపోతుంది. దానితో ఆంధ్ర, రాయలసీమ కాంగ్రెస్ నేతలు పూర్తి నిర్వేదంలో మునిగిపోయి న్నారు. తమ భవిష్యత్తు అంధకార బంధురమని ఆవేదన చెందుతున్నారు. వారిలో చిగురంత ఆశ రగిలించే ప్రయత్నం కూడా ముఖ్యమంత్రి చేయడం లేదు. కర్మ సిద్ధాంతాన్ని ప్రవచిస్తూ కాలక్షేపం చేస్తున్నాడాయన.

## మెడికల్ కాలేజీ!

16వ పేజీ కొరవ



పినతండ్రి కోరికను నెరవేర్చిన దొడ్ల శేషారెడ్డి.

నిర్వచనంగా శాశ్వత కీర్తి సంపాదించుకొన్న దొడ్ల సుబ్బారెడ్డి 1965లో శ్రీకారం చుట్టిన ప్రతిపాదన అది. ఆయన మరొక రెండు మూడేళ్లు జీవించి వుంటే ఆకాలంలోనే నెల్లూరుకు మెడికల్ కాలేజీ వచ్చి వుండేది. ఆ తర్వాత నెల్లూరు జిల్లా మీద అధికారం చెలాయించిన ఒక్క రాజకీయవాది కూడా దొడ్ల సుబ్బారెడ్డి కన్నకల నెరవేర్చడానికి చిన్న ప్రయత్నం కూడా చేయలేదు. ఏసి సుబ్బారెడ్డి, ఆనం సంజీవరెడ్డి, ఆనం వెంకటరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, రేబాల దశరథరామిరెడ్డి, నేదురుమల్లి జనార్దనరెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, ఎం.వెంకయ్యా నాయుడు, తిక్కవరపు సుబ్బరామిరెడ్డి, చింతా మోహన్, పనబాక లక్ష్మి, పులి వెంకటరెడ్డి వంటి వారెందరో ఈ జిల్లా నుంచి మంత్రులుగా, కేంద్ర మంత్రులుగా, గవర్నర్లుగా, ముఖ్యమంత్రులుగా పని చేశారు కానీ, ఒక్కరంటే ఒక్కరు జిల్లా ప్రజల చిరకాల వాంఛితాన్ని నెరవేర్చాలనుకోలేదు. తమ పదవులు కాపాడుకోవడానికి రాజకీయం చేయడం తప్ప జిల్లా ప్రజల మనసులు గెలుచుకోవడానికి ప్రయ త్నించలేదు. అందువల్లనే చిటికెలో కావల్సిన పనికి ఐదు దశాబ్దాలపాటు ఎదురు చూడవలసి వచ్చింది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

పూర్తి చేసుకొన్న సందర్భంగా స్వర్ణోత్సవాలను నిర్వహిస్తున్నట్లు పూర్వ విద్యార్థులు తెలిపారు. డిసెంబర్ 8, 9 తేదీల్లో జరిగే ఈ కార్యక్రమానికి పెద్ద సంఖ్యలో పూర్వ విద్యార్థులు తరలి రావాలని కోరుతున్నారు పూర్వ విద్యార్థుల సంఘం నిర్వాహకులు.

## వాడా జ్ఞాపకార్థం ఉచిత వైద్య శిబిరం

ముత్తుకూరులో తిరుగులేని కాంగ్రెస్ నాయకుడు దివంగత వాడా వేణుగోపాల్‌రెడ్డి ప్రథమ వర్ధంతిని పురస్కరించుకొని ఆయన సతీమణి వాడా వెంకటశేషమ్మ 28వ తేది ఉచిత వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేశారు. నెల్లూరు మాదరన్ ఐ హాస్పిటల్, నారాయణ దంత వైద్యశాలకు సంబంధించిన వైద్యులు కంటి, దంత సమస్యలతో బాధపడే వారిని వాడా వేణుగోపాల్‌రెడ్డి ఇంట్లో ఏర్పాటుచేసే శిబిరంలో పరీక్షించి అవసరమైన వారికి మందులు కూడా అందిస్తారు. ఈ వైద్య శిబిరానికి లయన్ క్లబ్ కూడా సహకారమందిస్తుందని, ప్రజలు ఈ శిబిరాన్ని వినియోగించుకోమంటున్నారు వాడా వెంకటశేషమ్మ.

## జనవాణి

2వ పేజీ కొరవ

కార్యాలయంలో వేలకువేలు లంచాలు తీసుకుంటూ అరాచకాలు, అక్రమాలకు పాల్పడే మగవాళ్లకు అండగా నిలబడటం శోచనీయం. స్త్రీకి స్త్రీయే శత్రువని మహిళా సంక్షేమ శాఖ చాటి చెప్పడం బాధాకరం.

ఎస్వీఎస్ కోటేశ్వరరావు నెల్లూరు

## పదరంగం -39

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | ■ | 4 | 5 | ■ | 6 | | 7 | 8 |
| ■ | 9 | | ■ | 10 | | | | ■ | 11 | |
| 12 | | | 13 | ■ | | ■ | 14 | 15 | ■ | |
| | ■ | ■ | | ■ | ■ | 16 | ■ | | ■ | ■ |
| 17 | 18 | 19 | | ■ | 20 | | 21 | | ■ | 22 |
| ■ | | ■ | ■ | 23 | | ■ | | ■ | 24 | |
| 25 | | ■ | 26 | | ■ | 27 | | 28 | ■ | |
| | ■ | 29 | | | ■ | | ■ | 30 | | |
| 31 | 32 | | ■ | ■ | 33 | | ■ | | ■ | ■ |
| ■ | | ■ | ■ | 34 | | | | ■ | 35 | 36 |
| 37 | | | ■ | 38 | | | ■ | 39 | | |

**అడ్డం**

1. పండిట్ రవిశంకర్ గారి వాయిద్యం (3)
2. మాలిక (2)
6. పాండవులలో నాల్గవవాడు (4)
9. ఆడ కాదు (2)
10. తెర, పరదా (4)
11. రోడ్లకు వాడేది (2)
12. చీకట్ల అడవి (4)
14. తెలుగు లెగ్ అటు నుంచి (2)
17. రెండు కలలతో అలజడి (4)
20. పండితుడు కాదు (4)
23. పండు కాదు (2)
24. శిరస్సు (2)
25. విష్ణువు (2)
26. నూతన, తొమ్మిది (2)
27. మిడిల్ (3)
29. రెంటికి చెడింది (3)
30. తామరపూవు (3)
31. మాస్క్, ఆచ్ఛాదన (3)
33. బురిడి (2)
34. సరస్సు, కొలను (4)
35. అటు నుంచి మామ, మరోవిధంగా (2)
37. నష్టంగా కాదు (3)
38. తెలుగు పెన్ను (3)
39. కదలిక (3)

**నిలువు**

2. కమలం, ఒక చర్మవ్యాధి (3)
3. రచ్చ (3)
4. జాదూ (2)
5. క్రింద నుంచి పెద్ద కథ (3)
6. డూప్లికేట్ (3)
7. క్రింద నుంచి గింజకట్టని విత్తనం తరకతోపాటు (2)
8. దొంగ క్రింద నుంచి (3)
12. కలకత్తా అమ్మవారు (3)
13. ఇరుకు కాదు (3)
15. కాలనేమి, యమధర్మరాజు (3)
16. తడి (2)
18. అలలు కలది, నది (3)
20. ఒక చీలిక (2)
21. రౌద్రస్వరూపుడు శివుడు (3)
22. నిద్రకాదు, అప్రమత్తత (4)
23. రెండు కొనలలో ఉల్లు గల వెదురు బద్ధ (3)
25. శుచిత్వము (3)
26. ఇరవై ఆరు అడ్డం (2)
27. నమస్తే (5)
28. మొసలి (3)
29. బదరీ వృక్షం (2)
30. ఏనుగు (2)
32. కష్టం కాదు (3)
33. తాళింపు సామగ్రి (3)
34. వేడి (2)
35. జాలము (2)
36. మర్యాద (2)

**సమాధానాలు**

## పదరంగం -38

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | న | 2 వా | లు | ■ | 3 క | 4 బీ | 5 రు | ■ | 6 ఈ | 7 ల |
| క | ■ | 8 తా | ప | 9 సి | ■ | 10 రు | య | మే | ■ | త |
| తా | ■ | వ | ■ | 11 రి | 12 క్షా | వా | లా | ■ | 13 మే | లు |
| యి | ■ | 14 ర | 15 తి | ■ | మం | ■ | ■ | 16 కే | క | ■ |
| ■ | ■ | 17 ణం | ర | 18 కా | ■ | 19 ప | ■ | స | ■ | 20 వా |
| ■ | 21 తా | ■ | 22 గ | డ | 23 స | రి | ■ | రి | ■ | కి |
| 24 ఆ | మ్ర | 25 పా | లి | ■ | 26 ర | చ | న | ■ | 27 క | లి |
| 28 ట | ము | కు | ■ | 29 ప్ర | ళ | యం | ■ | 30 తి | ■ | ■ |
| ■ | ■ | 31 డు | 32 వా | ■ | రే | ■ | 33 మ | రు | గు | ■ |
| 34 తే | ■ | 35 రా | ణి | ■ | 36 ఖ | 37 రం | ■ | ప | ■ | 38 కా |
| నె | మ | ళ్ళు | ■ | 40 ప | లు | గు | ■ | 41 తి | మి | రం |

# సంక్షిప్త సింహపురి

## పోలీసుల ఆయుధాల ప్రదర్శన

పోలీసు అమరవీరుల సంస్మరణ దినోత్సవాన్ని పురస్కరించుకొని జిల్లా పోలీసు యంత్రాంగం కొండాయపాళెం రోడ్డులో గల వాత్సల్య – జనహిత సంస్థ నిర్వహిస్తున్న భారతీయ విద్యావికాస్ ఇంగ్లీషు మీడియం హైస్కూల్ ఆవరణలో పోలీసులు ఉపయోగిస్తున్న వివిధ రకాల ఆయుధాలను ప్రదర్శించారు. ఈ సందర్భంగా ఫిఫ్త్‌టౌన్ ఎస్‌ఐ శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ దేశం కోసం, సమాజంలో శాంతి భద్రతలు కాపాడటం కోసం పోలీసులు నిత్యం వారి ప్రాణాలను సైతం లెక్కచేయకుండా సమాజ శ్రేయస్సు కొరకు నిరంతరం పాటుపడుతున్నారని ఈ విషయంపై పిల్లలకు అవగాహన కల్పించేందుకు ఈ కార్యక్రమం ఏర్పాటు చేసినట్లు చెప్పారు. ఎఆర్ ఎస్‌ఐ రవీంద్ర, హెడ్ కానిస్టేబుల్ గురవయ్య 303 ఎస్‌ఎల్‌ఆర్, ఎకె 52 ఎమ్ ఆయుధాలను పోలీసులు ఉపయోగించే తీరును వివరించారు. ఈ కార్యక్రమంలో స్కూల్ కరస్పాండెంట్ జి.వి.సాంబశివరావు, హెడ్ మాస్టర్ ఎం.మధుసూధన్‌రెడ్డి, అకడమిక్ ఇన్‌ఛార్జ్ వి.వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

## లయన్స్ క్లబ్ పుస్తకావిష్కరణ!

లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు అక్టోబర్ మాస సమావేశం ఇటీవల డిఆర్ ఉత్తమ హోటల్‌లో జరిగింది. ఈ సందర్భంగా రక్తదాత లయన్ వై.వి.సుబ్బారావు రచించిన రక్తదానం – నేత్రదానం – దేహదానం పుస్తకాన్ని లయన్స్ జిల్లా వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ వై.అమృతవల్లి ఆవిష్కరించారు. పుస్తకాన్ని లయన్ పి.ఆంజనేయులు సమీక్షించారు. రక్తదాత తిక్కవరపు సుకుమార్‌రెడ్డి, లయన్ వై.శ్రీనివాసరావు ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేశారు. రచయిత వై.వి.సుబ్బారావు మాట్లాడుతూ ఈ పుస్తకాన్ని చదివితే రక్తదాత కాని వ్యక్తి కూడా తప్పనిసరిగా రక్తదాత అవుతాడన్నారు. క్లబ్ అధ్యక్షుడు కె.లక్ష్మీనారాయణ, కార్యదర్శి ఎం.శ్రీధరరావు ఈ కార్యక్రమానికి ఆహ్వానం, వందన సమర్పణ చేశారు.

## సిపిఐ మాట్లాడింది!

చాలా రోజుల తర్వాత సిపిఐ పార్టీ నాయకులు ధైర్యంచేసి రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డిని విమర్శిస్తూ మాట్లాడారు. వివేకానందరెడ్డి ఆ పార్టీ నాయకుడు పముజుల దశరథరామయ్య గూర్చి నీచంగా మాట్లాడడంతో సిపిఐ జిల్లా కార్యదర్శి వి.రామరాజుకు కోపమొచ్చింది. సిపిఐ పార్టీ ఆఫీసులో విలేకరుల సమావేశం ఏర్పాటుచేసి వివేకాను తిట్టిపోశాడు. కనీస నైతిక విలువలులేని నాయకుడు ఎవరైనా నెల్లూరులో ఉన్నాడంటే ఆయన వివేకానందరెడ్డి. అటువంటి వ్యక్తి మా నాయకుడ్ని విమర్శించడమా? కొండ్లపూడిలో గిరిజనులకు సంబంధించిన భూమిని వివేకానందరెడ్డి రియల్ ఎస్టేట్ వ్యాపారులకు కట్టబెట్టాలని చూశాడు. దానికి దశరథరామయ్య అడ్డుగా నిలిచాడు. దీన్ని మనసులో పెట్టుకొని మమ్మల్ని అవినీతిపరులంటున్నాడు. గిరిజనుల నుంచి చిల్లర వసూలు చేసుకొనే దుస్థితిలో సిపిఐ పార్టీ లేదన్నారు. నీచ రాజకీయాలకు వివేకానందరెడ్డి స్వస్తి పలకకుంటే ప్రజా కోర్టులో ఆయనకు తగిన శిక్ష పడుతుందని రామరాజు శపించారు.

## పోలీసు కుటుంబాలకు అండదండలు!



పోలీసు అమర వీరుల సంక్షేమ దినోత్సవాన్ని పురస్కరించుకొని ఎస్పీ బి.వి.రమణకుమార్ పోలీసు అధికారుల సంక్షేమ సంఘం కార్యాలయంలో ఆత్మీయ సమావేశం ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ మృతి చెందిన పోలీసులు తమ కుటుంబసభ్యులేనని, వారి కుటుంబాల బాధ్యత జిల్లా పోలీసు శాఖ తీసుకొంటుందని చెప్పారు. ఈ కుటుంబీకులకు ఏ అవసరమొచ్చినా నేరుగా తనను కలిస్తే సాయం చేస్తానని హామీ ఇచ్చారు. మృతుల కుటుంబాలకు అందాల్సిన అన్ని సౌకర్యాలు అందించేందుకు పోలీసు అధికారుల సంఘం చేస్తున్న కృషిని అభినందించారు. పిల్లలను, వారి చదువులను నిర్లక్ష్యం చేయవద్దని, పోలీసుల పిల్లలు దేశానికి సేవచేసే వ్యక్తులు కావాలని ఆకాంక్షించారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు నగర ఇన్‌ఛార్జి డిఎస్పీ బాలకోటేశ్వరరావు, సిసిఎస్ సిఐ వీరాంజనేయరెడ్డి, పోలీసు అధికారుల సంఘం నాయకుడు జి.మాధవరెడ్డి, శ్రీహరి పాల్గొన్నారు.

## తెలుగు మైనార్టీ సెల్‌కు మళ్లీ మున్వర్!

తెలుగుదేశం పార్టీ మైనార్టీ సెల్ జిల్లా అధ్యక్షునిగా ముచ్చటగా మూడోసారి మున్వర్ బాషా ఎన్నికయ్యారు. మున్వర్ నెల్లూరు జెండా వీధిలోని సాంప్రదాయ ముస్లిం కుటుంబీకుడు దివంగత ఖుద్దూస్ సాహెబ్ కుమారుడు. రొయ్యల వ్యాపారం చేసే మున్వర్ ఇటీవల తెలుగుదేశం పార్టీని వీడే ప్రయత్నం చేసినా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఆయన్ను సుతిమెత్తగా మందలించి పార్టీలో కొనసాగేట్లు చేయడంతోపాటు మూడోసారి మైనార్టీ సెల్ అధ్యక్షుడు అయ్యేలా చక్రం తిప్పాడు.



## రైతు లోకం: రబీలో పంటలలో కలుపు యాజమాన్యం!

ప్రస్తుతం మార్కెట్‌లో అనేక రకాల కలుపు మందులు లభిస్తున్నాయి. అయితే ఏ పైరుకు ఏ మందును, ఎంత మోతాదులో, ఏ సమయంలో, ఎలా వాడాలో అన్ని వివరాలు పూర్తిగా తెలుసుకొన్న తరువాత మాత్రమే వాడాలి. సిఫార్సు చేయని పూర్తి వివరాలు తెలియని కలుపు మందులను ఎట్టి పరిస్థితుల్లో వాడకూడదు.

**వరి:**

నాటిన మూడు నుండి ఐదు రోజులలోపు వాడదగిన కలుపు మందులు ఒక ఎకరాకు

బ్యూటోక్లోర్ 1.5 లీటర్లు లేదా ప్రెటిలాక్లోర్ 600 మిల్లీలీటర్లు లేదా అనిలోఫాస్ 500 మిల్లీలీటర్లు లేదా ఆక్సాడయార్జిల్ 35గ్రాముల మందును 20కిలోల ఇసుకలో కలిపి చల్లుకోవాలి.

నాటిన 8 నుండి 12 రోజుల సమయంలో ఐతే పైరజోసల్ఫ్యూరాన్ ఇథైల్ 80 – 100గ్రాములు ఒక ఎకరానికి పిచికారీ చేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

నాటిన 20 నుండి 25 రోజుల సమయంలో ఐతే 2, 4–డి, సోడియం సాల్ట్ 400 గ్రాములు ఒక ఎకరానికి పిచికారీ చేయాలి.

గడ్డి జాతి మరియు వెడల్పాకు కలుపు నివారణకు బిస్‌పైర్‌బాక్ సోడియం (నామినిగోల్డ్) ఎకరాకు 100 మిల్లీలీటర్ల మందును 15 నుంచి 20 రోజుల మధ్య పిచికారీ చేసుకోవాలి.

**మినుము:**

పెండిమిథాలిన్ 30% ద్రావకం ఎకరాకు 1.0 నుండి 1.5లీటర్లు లేదా అలాక్లోర్ 50% ఎకరాకు లీటరు చొప్పున విత్తిన వెంటనేగానీ మరుసటి రోజునగానీ పిచికారీ చేయాలి. విత్తిన 20–25 రోజులప్పుడు గొర్రుతో అంతరకృషి చేయాలి.

ఊద, చిప్పెర, గరిక లాంటి గడ్డిజాతి మొక్కల నిర్మూలనకు ఇమజితాఫిర్ 300 మిల్లీ లీటర్లు ఎకరాకు 20–25 రోజుల సమయంలో పిచికారీ చేయాలి. 

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14



# నెల్లూరులో వచ్చే ఏడాది మెడికల్ కాలేజీ!

## ● నెరవేరనున్న ఐదు దశాబ్దాల నాటి కోరిక.

నెల్లూరులో ప్రభుత్వ నిర్వహణలో వైద్య కళాశాల కావాలన్న నెల్లూరీయుల చిర కాల కోరిక నెరవేరబోతున్నది. దర్గామిట్టలోని పెద్దాస్పత్రి ప్రాంగణంలో వచ్చే విద్యా సంవత్సరం నుంచి ప్రభుత్వ వైద్య కళాశాల ప్రారంభానికి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి పచ్చ జెండా వూపాడు. రాష్ట్రంలో ప్రభుత్వ రంగంలో కొత్త మెడికల్ కాలేజీలు నెల కొల్పమని కేంద్ర ప్రభుత్వం వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడే సంకేతాలిచ్చింది. నెల్లూరు, నిజామాబాద్, హైదరాబాదులోని ఎర్రగడ్డ ఆస్పత్రులలో కొత్త కాలేజీలు మొదలు పెట్టాలని వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడే ఆలోచన చేశారు. నిజామాబాద్ కాలేజీకి ఆయన శంకుస్థాపన రాయి కూడా వేశాడు. అయితే అప్పట్లో మన జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఆ అవకాశాన్ని తన స్వలాభం కోసం వాడుకోవడానికి ప్రయత్నించడంతో నెల్లూరు కాలేజీకి ఆదిలోనే హంసపాదు పడింది. నెల్లూరులో ప్రభుత్వ నిర్వ హణలో కాకుండా పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యంతో కొత్త కాలేజీ పెట్టాలని ప్రతిపాదించాడు రామనారా యణరెడ్డి. బొల్లినేని ఆస్పత్రి వారి చేత అందుకు దరఖాస్తు చేయించాడు. పెద్దాస్పత్రి ప్రాంగణంలో వున్న 1500 కోట్ల రూపాయలకు పైగా విలువ చేసే 80 ఎకరాల స్థలాన్ని ఉత్రఉడియంగా కొట్టేయడా నికి ఆయన పన్నిన పన్నాగం అది. అయితే తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ ఈ కుట్రను ముందుగానే పసిగట్టి, గట్టిగా ప్రతిఘటించడంతో ఆ ప్రతిపాదన వెనక్కు పోయింది. దానివల్ల నెల్లూరుకు కొత్త మెడికల్ కాలేజీ రావడంలో మూడేళ్ల ఆలస్యం జరిగింది. ఈ విలువైన ఆస్తిని కాజేయడం జరిగే పని కాదని అర్ధమైపోవడంతో రామనారాయణరెడ్డి తన దరఖాస్తుకు స్వస్తి చెప్పక తప్పలేదు. దానితో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి చొరవ చూపి, కాలేజీ స్థాపనకు అవసరమైన దాదాపు 350 కోట్లు మొత్తానికి మంజూరు ఇవ్వడంతో పాటు, తక్షణమే పనులు మొదలు పెట్టడానికి 100 కోట్ల వరకు నిధులు విడుదల చేశారు. దానితో వచ్చే విద్యా సంవత్సరం నుంచే నెల్లూరులో మెడికల్ కాలేజీ మొదలు కాబోతున్నది.

### మెడికల్ కాలేజీకి మించి వనరులు!

మెడికల్ కౌన్సిల్ నియమాల ప్రకారం మెడికల్ కాలేజీ స్థాపనకు కనీసం 25 ఎకరాల స్థలం, 350 పడకల ఆస్పత్రి కావాలి. నెల్లూరు పెద్దాస్పత్రి ప్రాంగణంలో దాదాపు 79 ఎకరాల స్థలం సిద్ధంగా వుంది. పెద్దాస్పత్రిలో 250 పడకలు న్నాయి. రేబాలవారి వీధిలోని చిన్న పిల్లల ఆస్పత్రిని పెద్దాస్పత్రి ఆవరణంలోకి మార్చడానికి తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ గత ఏడాది ఐదు కోట్ల రూపాయలు కేంద్రం నుంచి మంజూరు చేయిం చాడు. దానితో కలిపితే మెడికల్ కాలేజీకి అవసర మైన పడకల సంఖ్య సరిపోతుంది. అదనంగా మద్రాసు బస్టాండ్ దగ్గరలోని జూబ్లీ కాన్పుల ఆస్ప త్రిని కూడా ఇక్కడకు తరలిస్తే పడకల సంఖ్య 400కి పెరుగుతుంది. అందువల్ల మెడికల్ కాలేజీ అవసరా లకు మించిన వనరులు నెల్లూరులో వున్నట్లు లెక్క.

మొదటి సంవత్సరం 150 మంది విద్యార్థు లతో మొదలౌతుంది కాలేజీ. ప్రభుత్వం ఇచ్చే 350 కోట్ల నిధుల వినియోగం జరిగితే పెద్దాస్పత్రి పడకల సంఖ్య 750 వరకు చేరుకొంటుందని అంచనా. అప్పుడు ఎంబిబిఎస్‌లో ప్రవేశానికి 250 మంది విద్యార్థులకుపైగా అనుమతి రావడంతో పాటు, పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులకు కూడా అవకాశం ఏర్పడుతుంది. హైదరాబాదులోని గాంధీ, ఉస్మా నియా ఆస్పత్రులతో సమానంగా నెల్లూరు వైద్య కళాశాల అభివృద్ధి చెందే అవకాశాలు వున్నాయి.



దొడ్ల సుబ్బారెడ్డి నెల్లూరులో కట్టించిన పెద్దాస్పత్రి.

### ఎన్నో ప్రయోజనాలు!

మెడికల్ కాలేజీ ఏర్పడితే నగరానికి, జిల్లాకు ఎన్నో ప్రయోజనాలు సిద్ధిస్తాయి. అన్నిటికంటే మొదటిది – మెరుగైన వైద్య సేవ. మెడికల్ కాలేజీకి అనుభవం, ఉన్నత విద్య కల్గిన డాక్టర్లు కావాలి. ప్రభుత్వ రంగం కాబట్టి సీనియర్ డాక్టర్లు కూడా వెనుకా ముందు చూడకుండా ఉద్యోగానికి వస్తారు. మరొకప్రక్క ఇప్పటి మెడికల్ కౌన్సిల్ నియమాల ప్రకారం ఆధునిక వైద్య పరికరాలు, యంత్ర పరి కరాలు సమకూర్చక తప్పదు. దీనివల్ల నెల్లూరు ప్రజానీకం అత్యవసర వైద్యం కోసం మద్రాసుకు పరుగులు పెట్టవలసిన అగత్యం తప్పుతుంది. మెడి కల్ కాలేజీ స్థాపన వల్ల నగరంలోని ప్రైవేటు డాక్టర్లు తమ వైద్య పరిజ్ఞానాన్ని మెరుగుపరచుకొనే అవకాశం లభిస్తుంది. తరచూ జరిగే సెమినార్లు, సద స్సులు, గోష్టులు, వాటిలో పాల్గొనే నిపుణుల ఉప న్యాసాలు వైద్య వృత్తిలో వున్నవారికి ఎంతగానో ఉపకరిస్తాయి.

### దొడ్ల సుబ్బారెడ్డి వుంటే ఎప్పుడో కాలేజీ వచ్చేది!

జిల్లా ప్రజానీకానికి ఎంతో సంతోషకరమైన వార్త ఇది. ఎన్నాళ్ల కల నెల్లూరు మెడికల్ కాలేజీ? దాదాపు యాభై ఏళ్ల క్రితం దాత అనే పదానికి

కొరవ 14వ పేజీలో

## వదాన్యతకు మారుపేరు దొడ్ల సుబ్బారెడ్డి!



నెల్లూరులో కొత్తగా ప్రారంభం కాబో తున్న ప్రభుత్వ వైద్య కళాశాలకు ఏసి సుబ్బా రెడ్డి పేరు పెట్టాలని ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌కు చెం దిన డాక్టర్లు ప్రభుత్వా నికి ఒక విన్నపం పం పారు. వైద్యకళాశాలకు ప్రైవేటు ప్రాక్టీసు చేసుకొనే డాక్టర్లకు ఎటువంటి సంబంధం లేదు. వారి విన్న పానికి ప్రేరణ – రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకా నందరెడ్డి ఒత్తిడి. ప్రభుత్వ సంస్థకు తమ కుటుంబ సభ్యుడి నామకరణం చేయమని అడగడం ఎబ్బె ట్టుగా వుంటుంది కాబట్టి ప్రైవేటు డాక్టర్ల చేత అడి గించాడు.

ఏసి సుబ్బారెడ్డి గారు నెల్లూరు ప్రజలకు అభిమాన పాత్రుడన్నది నిజం. అందులో రెండు అభిప్రాయాలు లేవు. దాన్ని చాటుకోవడానికి నెల్లూరులోని చాలా సంస్థలకు ఆయన పేరుతో నామకరణం చేశారు. స్పోర్ట్స్ స్టేడియం, కూర గాయల మార్కెట్ వంటి శాశ్వత సంస్థలే ఆయన పేరుతో ఏర్పడి వున్నాయి. పైగా వైద్య కళాశాలకు, ఏసి సుబ్బారెడ్డి గారికి చీపురు పుల్లంత సంబంధం కూడా లేదు. అందుకోసం కల కన్న స్వాప్నికుడు దొడ్ల సుబ్బారెడ్డి గారొక్కరే.

ఈ తరంలో దొడ్ల సుబ్బారెడ్డిని చూసిన వారు పెద్దగా లేకపోవచ్చు. కానీ ఆయన పేరు విననివారు నెల్లూరులో ఎవరూ వుండరు. వదా న్యత అనే పదానికి అసలుసిసలు నిర్వచనం దొడ్ల సుబ్బారెడ్డి జీవితం. కాంట్రాక్ట్ వ్యాపారంలో కోట్లకు కోట్లు కూడబెట్టిన వారు మన జిల్లాలో లెక్కకు మించి వున్నారు. కానీ తాను సంపాదిం చిన దానిలో కొంత భాగాన్ని సమాజం కోసం వెచ్చించాలనే సులక్షణం కల్గిన ఉన్నత మనస్కుడు

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com